# బృందావనం

## (కథల సంపుటి)

పురాణం సుబ్రహ్మణ్యశర్మ

ప్రచురణ

ప్రజా ప్రచురణలు

ఏలూరు.



## వేదాక్షరాలు

పేరేమో నోరు తిరగదు
మనిషినేమో కళ్లెత్తి చూడాలి
హోదాకి యం. పీ.
దర్జాకి యమ్మే
లంకంత కొంపా
బోలెడు డబ్బూ
(లోకానికి అసూయ,
నాకెందుకో చెప్పనా ?)
అంత కమ్మగాయెందుకు పాడాలీ ?
అంత మరీ మంచిగా
యెందుకుండాలీ అని-
అందుకే యీ బృందావనాన్ని
ఇదిగోయిస్తినమ్మా వాయనం !

* ఈ బృందావనంలో...
* ఇల్లు జాగ్రత్త!
* అనురాగమాలిక
* జవానీకి రైలు
* ముసలమ్మ మరణం
* పరిత్యక్త
* పరదేశి
* అనవసరపు దాంపత్యం
* సైనిక సమాచార్ సౌజన్యంతో—

# ఇల్లు జాగ్రత్త

## 1

"ప్రేమకి పడిశం పట్టినట్లుంది-" అని కాస్త నొక్కి వాక్యం పూర్తి చేసింది యింటావిడ.

"ఇదే ఏదో కథలో మొదటి వాక్యమైతే ఎంత రసాభాస అవుతుందో ఆలోచించావా?" అన్నాను కావాలని.

"మనకి ప్రేమ అనే ఆరునెల్ల అమ్మాయివుందని, దానికి పడిశం పట్టిందని వాళ్ళ అమ్మ చెబ్తోందనీ-ప్రపంచానికి తెలీడమెల్లాగ?" అన్నాను కాస్త నాటకంలోలా అభినయిస్తూ.

"చాల్లెండి మీరూ మీ వెటకారాలూనూ........" అంటూ కిటికీ తలుపుల్ని తెరచి తెరల్ని గుంజుతూ "ఉక్క చంపేస్తూందండీ! ఏం వూరోయేం పాడో....స్నానాల గదిలో నీళ్లురావు. వంటగదిలో ఒక్క బొట్టుకూడా రాలటంలేదు. దొడ్డిలో మంచెడు నీళ్ళన్నా రావటంలేదు. ముదనష్టం పంపులు ఎందుకిన్నీ?" స్వగతం చెప్పుకపోతోంది కిటికీ తెరల్ని కోపంగా వూడలాగుతూ. నాకు అకస్మాత్తుగా తెలివొచ్చి పడింది, "ఆగు! ఏవిటాపని-చూస్తున్నావా నా వేషం? నీ కింత మతి పోతూందే? ఉక్క చంపేస్తూందని నే నిల్లా అర్ధనగ్నంగా తగులడ్డానా-నువ్వాకిటికీ తలుపు లన్నీ బార్లా తెరిచేస్తావుగదా! నలుగురూ యేమనుకుంటారే?" నేను చిన్న తువ్వాలుముక్క చుట్టుగుని వాలు కుర్చీలో పేపరు చూస్తూ అఘోరిస్తున్నాను. ఆవిడ పల్చటిచీర చుట్టుకుని జలంతా విరియబోసుకుని వుసురుసురంటూ వచ్చింది.

"అల్లా వెళ్ళి రెండు బాల్చీలు నీళ్లు పట్టా కూడదూ? చక్కగా స్నానంచేసి అటెక్కడికన్నా సాయంత్రం పోయి రావచ్చు!" నాకస్సలే

వుడుకుపోటుతనంగా వుంది. పై పెచ్చు సన్నాయి నొక్కులు....
"చాల్లే సంతోషించాం! తెలివి తేటలు-" అని చిరాగ్గా అరిచాను. శాస్త్రి
చిన్నబుచ్చుకున్నట్లేవుంది. నెమ్మదిగా గదిలో తచ్చాట్లాడుతూ పవిటతో
విసురుకుంటూ - "మగవారు - నలుగురుబిడ్డల తండ్రి. చదువుకున్న
వారు. అంతో యింతో పేరూ ప్రఖ్యాతివుంది నలుగుర్లో. మనపని
మనం చేసుకోవటం తప్పా - అల్లా చిర్రు బుస్సుమంటూ రేందుకూ?
నాకు తెలుసువెండి-మీ కెందుకో చెడ్డ కసిగావుంది నామీద." శాస్త్రి
గొంతుక బొంగురు పోయింది.

"కసా? నీమీదా - నాకా? ఎందుకూ! "ఆడవాళ్ళకు చిత్రంగా
వస్తాయి కన్నీళ్లు. నా చేతుల్లోంచి పేపరుజారి వొళ్లో పడింది మోకాళ్ళ
కడ్డంగా.

"మీరు రమ్మనకుండా యిల్లా వచ్చాననీ...." ముఖంమీంచి
చేతుల్ని లాగుతూ - "వోస్-అదా....ఛా....ఛా....నామాటవిను. నాకల్లాటి
దేంలేదు. ఎంత వొట్టుపడితే అంత వొట్టు!" అన్నాను.

నులకమంచంలో పసిది ఖళ్లుఖళ్లున దగ్గుతోంది లుంగలు చుట్టుకు
పోతూ. స్నానాలగదిలో పంపు బుసలు కొడ్తోంది—నీళ్ల వచ్చే సూచన!
పాపని ఎత్తుకుని క్షణంలో జేగురించిన మొహంతో కాళ్ళీడ్చుకుంటూ
వెళ్ళిపోయింది గదిలోనుంచి.

"హమ్మయ్య!" అని జావకడిలా కుర్చీలో వాలి పోయాను.
ఎంత రసాభాస? నిజంగా తనురావటం ఇష్టంలేదని ఎలా కనిపెట్టే
సిందో....కనిపెట్టేసింది. పదేళ్ళు కాపురంచేసిన మనిషి....అంతమాత్రం
గ్రహించుకోలేదా? నాకుమాత్రం తల కొట్టేసినంత చెడ్డ అవమానంగా
వుంది.

నలుగురైదుగురు ఒకచోట చేరి కష్టసుఖాల్నిగూర్చి చెప్పుకునే
టప్పుడు జీవితాల్నిగూర్చి తెలుస్తూన్న సంగతులు మహాదారుణంగా
వుంటున్నాయి. చేసుకున్న పెళ్లాం పిల్లల్తో కాపురానికొస్తే ...హఠాత్తుగా

చెప్పకుండా చెయ్యకుండా వచ్చినందుకు ముఖం ముటముట లాడించు కుంటున్నాను. నా అసమర్థత కప్పిపుచ్చుకుందుకు గట్టిగా నవ్వేస్తున్నాను.

ఇది ఢిల్లీ !
గుండె ఝల్లుమంటోంది !
ఈ పతాక మన శాంతిపతాక—
దీని నీడనే నేడు నేను భార్యాబిడ్డలను ఆదరించుకుంటున్నాను,
శుభం మంగళానిభవంతు !

పాపం మిమ్మల్నిపదిలి వుండలేనండీ అని చెప్పడానికి నోరురాక-హఠాత్తుగావచ్చి ఆశ్చర్యపెట్టి సంతోషపరుద్దామన్న ఆశతో వచ్చి యేం చూసింది ?

గుండె ఝల్లుమంటోంది,
ఢిల్లీ ! !
— ఇది అసమర్థతకు రాజధాని :
పాపం శమించుగాక !
మా ఆవిణ్ణడగండి చెబ్తుంది, ఏం చూశావమ్మా వచ్చినరోజు ?
తెల్లబోయి కొయ్యబారిపోయిన నా ముఖం !
ఆ తర్వాత—
దారిపొడుగూనా వర్షంలా తిట్లు !

"బుద్ధిలేదూ ! నువ్వేమన్నా ఇంగితజ్ఞానం వున్న మనిషివేనా ? ఎందుకూ ఇన్నాళ్లు చేశావ్ కాపురం ? నాలుగునెల్లు కొంపలో పడివుండవే అని పుట్టింటికి పంపితే-నేను ఇలావచ్చి ఢిల్లీలో పాపం మోశానో లేదో....నెల్లాళ్ళన్నా కాకుండా తియ్యాపయ్యావ్ - ప్యాసుముక్క ఎక్కపోయి నీ చేతులో పెట్టినందుకు ఇదా శాస్తి ! ఇప్పుడిక్కడ కొంపయేది ?....రైలంటూ పూరిఖేనేగదా అని పాతికో పరకో చేత్తో పుచ్చుకుని రైలెక్కావ్ ? ఇక్కడ నాకు ఇంకా జీతపురాళ్ళన్నావచ్చి యేడవలేదాయే !" ఇదంతా కోపంకానట్లు యీ అవమానాన్నంతా తుడి

చేసుకుంటూ తెచ్చిపెట్టుకున్న నవ్వుతో"ఈ భాగోతమంతా యిక్కడ ప్లాటుఫారంమీదేనా....యింటికి వెళ్లాక మీరెన్నన్నా అనొచ్చు —నేను పడొచ్చు! మామూలేగా—" నేనుయింకా రెచ్చిపోయి తారస్థాయిలో—

"హాస్యమాడుతున్నాననుకున్నావా? ఇల్లేవిటి నీ బొందా నా బొందాను...జాఫరీలో బెడ్డింగు పెట్టుకుని అఘోరిస్తూంటేనూ —" నా కింకాబాగా రక్షరు కట్టినట్లుంది.

"అయ్యో-ప్రేమను ఎత్తుకొని ముద్దాడరేమండీ? చంకలో చంటి పిల్ల మీ కేకలకు బిక్కచచ్చిపోయి ఎల్లా మిటుకూమిటుకూచూస్తోందో...." నేను మతి పోయినట్లు ఆవిడగారు సంసారం నిమిత్తం తెచ్చిన పీటలు జాడీలు ఝబ్బురోలు వగైరాలు వగైరాలు చూస్తూ కొయ్యబారిపోయాను, ఆ సామానులోనే యిరుక్కుని నిర్ఘాంతపోయి కూర్చున్నారు నా పెద్ద కొడుకూ చిన్నకొడుకూనూ, నేను వాళ్ళను చూడనన్నా లేదు, ఈలోగా రాణీగారి తమ్ముడొచ్చాడు, వీడుకూడా వున్నాడన్నమాట!—వుద్యోగం కోసం రాలేదుగదా! కాస్త అనుమానంగా చూశాను, అప్పటి కప్పుడే వాడు న్యూఢిల్లీ ప్లాటుఫారమంతా కలయ తిరిగొచ్చాడు. మా ఆవిడ తనకు జరిగిన మర్యాద అప్పుడే మర్చిపోయిందల్లేవుంది.

"అదేవిటండీ — వాణ్ణి పలకరించరండీ!" అంటూ వెనకేసు కొచ్చింది, జండాకొయ్యలా యెదిగిపోయాడు. నల్లకళ్ళద్దాలూ—ప్లాస్టిక్ బెల్టు-సిల్కు బుష్కోటూ —ఖరీదైన బూట్లూ--సిల్కు రుమాలుతో కళ్ళజోడు తీసి తుడుస్తున్నాడు,

"ఏవిరా యీ మాటైనా ప్యాసయినావా?"

"హ్హా!"—పూర్తిగా మాట్లాడుగాదల్సు! తమ్ముడి దర్జాకు మురిసి పోతోంది కాబోలు —

"పెళ్ళిసంబంధం వచ్చిందండీ. ఐదువేలు.... సంబంధం చేస్తా రేమోనని నాతోఢిల్లీ చూస్తానని వచ్చేసాడు, సరే రమ్మన్నాను".

"యేడిచావు" అని లోపల్నే అనుకుని "వదవద అనక తాపీగా చెబ్దువుగాని కబుర్లు. ఆఫీసు మధ్యలో వచ్చేశాను," అని లోపలి ఆక్రోశంతో సంసారం సంసారాన్ని న్యూఢిల్లీ స్టేషను కెదురుగానున్న "లేడీ హార్డింజ్ శరాయ్"లో చేర్పించేసి నా బావమరిదికి వార్నింగు యిచ్చాను —

"నేను మళ్ళీ సాయంకాలం వచ్చేదాకా యెక్కడికీ కదలకుండా సామాన్లూ మనుష్యుల్నీ కనిపెట్టుకు వుండు"మని,

## 2

స్టేషనుపేరు న్యూఢిల్లీ అయినా ఆ ప్రదేశాన్నంతా "పాహడ్ గంజ్" అంటారు. లోకవ్యవహారానికి ఆ స్టేషన్నికూడా జనం పాహడ్ గంజ్ స్టేషననే పిలుస్తూంటారు. అక్కడ పెద్ద బజారు, యింకా లోనికి పోనుపోను కూరల మార్కెట్లు అవీ వున్నాయి. న్యూఢిల్లీ స్టేషను ఆవరణ యెంత దర్జాగా ఠీవిగా సుందరంగా వుంటుందో ఆ కాస్త మేరా దాటాక అంతచెడ్డ గలీజుగానూ మురికికూపంలానూ వుంటుంది. ముఖ్యంగా "లేడీ హార్డింజ్ శరాయ్" కెదురుగా గుండ్రటి చిన్నపార్కు కట్టారు. అందులో పగలస్తమానూ సోమరులుపడి దొర్లుతూంటారు. ఈ పార్కుకు ప్రక్కనే ఒక పెద్ద చెట్టునీడను హమేషా మంగళ్లు కత్తులు సానపడ్తూ కత్తెరలను టకటకలాడిస్తూ నిత్యకల్యాణంచేసి ఆ జుట్టునంతా పార్కు నిండా పోసివుంచుతారు. ఇది చాలదన్నట్లు టాంగావాళ్లు గుర్రాలను తెచ్చి నిలుపుతారు. అవి అన్నిపనులూ అక్కడే చేసి ఆ మార్గంగుండా నడిచి వెళ్ళవలసివస్తే పశువులకొట్టంలోంచి దాటుతూన్నట్లుంటుందిగాని- రాజధాని పరువు యెవరూ యెక్కడా నిలుపుతున్నట్లు కనపడదు, ఇక బజారులో దారికడ్డంగా "హాకర్లు" చక్రాలబళ్ళని తోసుకుంటూ "పచ్చి ఆల్బకరాపళ్ళు - లీచీపళ్ళు - చర్మం నల్లగా కమిలిపోయిన అరటిపళ్ళు- ముక్కలు ముక్కలుగా కోసిన పుచ్చకాయలు - మామిడి పళ్ళు" తూచి అమ్ముతూంటారు, ఈ బజారులోనే అన్ని దుకాణాల్తోనూ కలిసిపోయి అడుగడుగునా వెలపరం పుట్టించేలా కసాయిదుకాణా లున్నాయి. కాని యిక్కడదొరికే అన్నివస్తువులూ చవక అంటారు. రైల్వే స్టేషను కెదురు

గుండా వున్న దుకాణాలే కాకుండా, పేవుమెంట్లుమీద ఒక నులక మంచాన్ని గడకర్రతోయెత్తిపుంచి దానిక్రింద కొన్ని డజన్ల బూట్ పాలిష్ జోళ్ళ రిపేరు వగైరా వగైరా కేంద్రా లున్నాయి. ఈ ప్రాంతం యిలా ఎందుకుండని యెవరైనా ప్రశ్నిస్తే కాందిశీకులు వచ్చి పాడు చేశారని అంటారు. ఈ హార్డింజ్ శరాయ్‌దగ్గర ఇండియా టీ బోర్డువారి వాహనం వచ్చి నిల్చుని అణాకు మంచి టీ సప్లయిచేస్తూ వుంటుంది. ఈ రోడ్డు తిన్నగా కన్నాట్ సర్కస్‌లోకి వెళ్తుంది. దీనికి రైల్వేబద్దీ లకు మధ్యనున్న మేరలోంచి స్టేషు ఎంట్రీరోడ్డు వేశారు. ముఖ్యంగా రాష్ట్రపతి యింకా గొప్ప గొప్ప అతిథులు ఈ గలీజు చూడకుండా స్టేషనుకు వచ్చిపోవడానికి ఇరు ప్రక్కలా సుందరమైన ఉద్యానవనాలు పెంచారు. ఈ రోడ్డులోనే రైల్వేబోర్డు మంత్రాలయం, ఉత్తరరైల్వే మండలాధికారి ఆఫీసు, ఐ. ఆర్. సి. యే. భవనాలున్నాయి. కట్టడాల శిథిలాలు, మొగలాయి దర్బారులు, రాజఘాటు, ఎర్రకోట, జుమ్మా మసీదు, నిజాముద్దీను, హస్తినాపురం, హుమాయూను సమాధి, సఫ్దర్ గంజ్, కుతుబ్‌మినార్, చాందినీ చౌక్, పార్లమెంటు, సెక్రటేరియట్, రాష్ట్రపతిభవనాలు చూడవలసినవే అయినా చూడకూడనివి చూడ్డానికి వీల్లేకుండా కట్టుదిట్టాలు చేశారు. ఢిల్లీలోని యిరుకుతనాన్ని మురికి తనాన్ని కప్పుకుందుకు కట్టుకున్న "కన్నాటుప్లేసు" ఎంతసేపుతిరిగినా నేత్రానంద కరంగానే వుంటుంది. కాని నేను ప్రశ్నించుగుంటున్నది. యిక్కడ సామాన్యుడు ఎట్లా జీవిస్తున్నాడులని. పాలకులు పాలిస్తు న్నారు సరే——ఈ కాలంలో పాలితులు ఎట్లా జీవిస్తున్నారు?

చెప్పమంటారా?

నాబోటివాడి జీతం సొంతకొంపలు కలవాళ్లు కోరే అద్దెలకు చాలదు. సర్కారువారు యిచ్చేయిళ్లు నాబోటివాడికి దొరకడానికి యింకా రెండుపంచవర్ష ప్రణాళికల కాలం తీసుకుంటుంది. ఐతే కొందరు మహానుభావు లుంటారు. అట్టివారు తాము సర్కారు వారికి యిచ్చే అద్దెకు పదో పదో పరకో ముట్టచెప్పి వారి కనుసన్నల్లో మెలగడానికి

యిష్టపడినట్లైనా ఒక గది ఖాళీచేసియిస్తారు. ఇచ్చేముందు కొన్ని పరీక్షలు - ఇంటర్వ్యూలూ - స్క్రీనింగు వగైరా కార్యక్రమా లున్నాయి. మచ్చుకి—

"ఎక్కడ పనిచేస్తున్నారు - (మినిస్ట్రీ)"

"ఫలానా - ఫలానా."

కొందరు బ్రహ్మచారులే కావాలంటారు. కొందరు సంసారులే వుండాలంటారు.

"ఎంత జీతం ?"

చెప్పాక పెదవి విరిచి—నాలుక బైటపెట్టి తలకాయ ప్రక్కకు త్రిప్పి వాంతి వొస్తూన్నట్లు మొహం పెడ్తాడు.

"మద్రాసీ...."

"కాదు ఆంధ్ర...." అని చెప్పబోతే అంతా వొకటేలెద్దూ అన్నట్లు చూసి—"ఏవూరు ?" ఆవూరు వాడికి చెప్పినా అర్థమయి చావదు. తరువాత ఆ గదిలో యిదివరకు వుంటూవచ్చిన వాళ్ళను గురించి ముఖ్యంగా భయంకరంగా వర్ణించి చెబుతాడు. అదే అదనను కొని యిదివరకు వున్న వాళ్ళ అవలక్షణాలన్నీ వర్ణించాక—కొంచెం సేపు తన అభిరుచులూ తన చుట్టాల్లో గొప్ప పదవిలో వున్న వాళ్ళను పరిచయం చేస్తాడు. ఈ ఆముదం మోతాదు తప్పించుకుందుకు మనం కాస్త ధైర్యంచేసి వాడి పిల్లల్ని పలకరించటమో, హఠాత్తుగా జన్మలో యెరగనట్లు వాడి సైకిలునో కుర్చీనో మంచాన్నో దేన్నో అతిగా మెచ్చుగుంటూన్నట్టు మట్లాడాక మళ్ళీ క్రాసు పరీక్ష ఆరంభమవుతుంది.

"పెళ్ళయిందా ?" చెప్పాక "ఎంతమంది పిల్లలు"-ఈ సమాధానం చెప్పాక గది యిచ్చేదీ లేనిదీ వాడి ముఖవర్చస్సులోనే బైట పడి పోతుంది. "సంసారం ఎప్పుడు తీసుకువస్తావు ?" అది వాడెని అడగాలని మనం అర్థం చేసుకోటాని కొంతకాలం పట్టదు. ఇక్కడ్నుంచి—"రేడియో వుందా ? ఫాను.... కుంపటి.... ఇస్త్రీపెట్టి...." అన్నిటికీ లేదని

చెప్పాక "సామాను బాగావుందా? చుట్టాలెవరైనా వస్తారా?" చివరికి మనకి మతిపోయే పరిస్థితి తెచ్చి పెడ్తాడు ప్రశ్నలతో.

ఇల్లాటి అదృష్టమేనా పట్టనివ్వకుండా యింటావిడ హఠాత్తుగా ప్రత్యక్షమయింది. ఈ పరిస్థితిచెప్పుకోవటానికెవరూ లేరు. అలవాటుగా ఆఫీసు వదిలాక బైట కొచ్చాను. ఎవరిళ్ళకు వాళ్లు నియామకంగా సైకిళ్ళమీద బస్సులమీద కార్లమీద చేరుకుంటున్న సమయం అది. మధ్యాహ్నమల్లా యెండ పొడిచిందేమో ఐదుగంటలయాకకూడా సూర్యుడు యింకా చండనాలు త్రొక్కుతున్నాడు. అల్లాగే కాల్చుకుంటూ "శరాయ్"లో కెళ్లాను. చూద్దునుగదా శ్రీమతీ మా బావా పిల్లలూ స్నానాలు అవ్వీ చేసి రెడీగా కుస్తాబై కూర్చున్నారు. మధ్యాహ్నమల్లా నిద్రపోయి వుంటారు ప్రయాణం బడలికా అదీ తీర్చుకున్నారు.

"ఎక్కడికర్రా ప్రయాణం?"

ఈ చుట్టుప్రక్కలేమున్నావుండే కాస్తచూసి—పిల్లలకు యేదన్నా యింత తినిపించి కాస్సేపు అల్లా తిరిగిసద్దాం. ఎంతకని యీ గదిలో యింతమందిమీ ముక్కిచావటం?" సరే పదమన్నాను—నెమ్మదిగా మద్రాసు హోటలుకు పోయి కాఫీలు ఫలహారాలు పూర్తిచేశాం. మా ఆవిడ కొంచెం నాజూగ్గానే మస్తాబయింది. నేను పగలల్లా చాకిరీచేసి వున్నానేమో ఎక్కడా ఉలాలేకుండా ....కాస్సేపు యిద్దరమూ దొంగచూపులు చూసుకున్నాం. రాజీ పడబోతున్నామని గ్రహించినట్లున్నాడు మా బావమరిది—లేచి పిల్లల్ని తీసుకుని దూర దూరంగా తప్పించుకుని వాళ్ళడిగేవో ప్రశ్నలకు జవాబులు చెబ్తూ అవీ యివీ చూపిస్తున్నాడు. రీగాలు థియేటరు దాటి పార్లమెంటు వీధిలో కొచ్చాం. మా ఆవిడ జనాన్ని జాగ్రత్తగా పరిశీలిస్తో నడుస్తోంది.

"దిక్కులుచూడకు దేనిక్రిందన్నా పడ్తావు."

"అదేవిటండీ పల్లెటూరి దానికి చెప్పినట్టు చెబ్తారు?" రయ్

మంటూ వో స్కూటరు పక్కరకొట్టి మీదనుంచి దూసుకుపోయింది. చప్పున రెక్కపుచ్చుకు దగ్గరసా లాగాను.

"బావుందండీ! రోడ్డుమీద అల్లా జబ్బపట్టుకు లాగుతా రెందుకూ?" కోపంగా చూసింది.

"యీపాటికి ఆసుపత్రిలో వుండేదానివి. అటుచూడు —" ఎవరో ఒక అమ్మాయి లాంబరెట్టా వెనుకసీటుమీద కూర్చుని మొగుడ్ని గట్టిగా పడుంచుట్టూ చేతులేసి పట్టుకుంటోంది. ఆ స్కూటరు వేగానికి పవిట నిలవటంలేదు. ఎర్రటి పెదవులు— రోజారంగు బుగ్గలు — క్షణంలో రివ్వుమంటూ దూసుకుపోయారు.

'ఎల్లావుంది?'

'తగులడ్డట్టేవుంది. వీళ్ళకిదేం పొయ్యేకాలం—' ఒకావిడ వెనుక సీటుమీద ఆరు నెల్ల పసిగుడ్డు నెత్తుకొని కూర్చుంది. మొగుడుగారు సైకిలు తొప్పుకుంటూ తొక్కుతున్నారు.

'అయ్యో! పడిపోతారేమోనండి!—వీళ్ళ అఘాయిత్యంమండా—'

'నీయిష్టం వచ్చినట్లు అనుకో.—నీమాట లెవళ్ళకీ బోధపడవుగా!'

'ఐనా యిదేవిటండీయిక్కడ ఆడవాళ్ళింత బరితెగించి పోయారు? ఒంటిమీద గుడ్డెందుకూ సిగ్గన్నది లేకపోయాక—రామ! రామ! అల్లా వీధిని తిరగటానికి పదిమంది కళ్ళ బడ్డానికి ప్రాణం పోయటంటీ?'

అంతాపోయి 'జంతర్ మంతర్'లో కూర్చున్నాం. చెరుకుముక్కలు కొని తెచ్చాను, పిల్లలు బఠాణీలు వేచిన శనగలూ తెచ్చుకుంటున్నారు. మా బావ మరిది యింకా బిడియంగా దూరం దూరంగా తిరుగుతున్నాడు.

'ఏరోయ్ బావా—యిటురా?'

నాకు దగ్గరసావచ్చి కూర్చున్నాడు.

'మీ అక్క అంటుందీ యిక్కడ ఆడవాళ్లు బావుతేరని — నువ్వే మంటావ్ కుర్రాడా?'

'బలే దావుంటారు....పక్కా జంటలు జంటలుగా సైకిళ్ళమీద చల్లగాలిలో—'

'పాడుబుద్ధులూ—ఇహ : వీడేంబాగుపడ్తాడూ ?' చీకట్లో చేతులు త్రిప్పుతూ పెద్ద ఆరిందాలా చెబ్తోంది. రోడ్లమీద యీడువచ్చిన అమ్మాయిలు ఐసుక్రీములుతింటూ ఖులాసాగా సైకిలు త్రొక్కుకుంటూ పోతున్నారు. పంజాబీ డ్రెస్సుల్లో శరీర ముఖ్యభాగాలన్నీ ఆ సిల్కు తళత్తళల్లో మెర్క్యురీ దీపకాంతిలో అందులో సైకిలు త్రొక్కటంలో యిమిడి వున్న శ్రమలో చెమర్చిన ముఖాల్తో నవ్వుకుంటూ మైమరచిన వుల్లాసంతో ఎంతో సహజంగా అందంగా కదలాడే దృశ్యాల్నీ—కళ్ళు పెద్దవి చేసుకుని అర్థంగాక చీదరించుకుంటూ లేచి నిలబడి—'ఇక పదండి పోదాం, నాకు వెలపరంకూడా వస్తోంది' అని లేచింది యింటావిడ. 'కవులూ రచయితలూ నానా యమయాతనాపడి వర్ణించే అందాలన్నీ చూసి సంతోషించలేక ముఖం ముడ్చుకుంటా వెందుకూ ? చూడు మగవాళ్ళలో సరిసమానంగా నిర్భయంగా స్వేచ్ఛగా ఎట్లా వుండ గలుగుతున్నారో స్త్రీలు. ఆడవాళ్ళకీ మగవాళ్ళకీ తేడాలు ఎక్కువ తక్కువలు యేమీలేవు.'

'చాలించండి : ఆడా మగా తేడాలేదని వాదిస్తా రెందుకూ ? వంట చెయ్యటం, యిల్లు కనిపెట్టుకోవడం, పిల్లల్ని కనడం, బట్టలుతకడం, కాపురాలు చెయ్యటం మానేస్తారా ? పెళ్లిళ్లు చేసుకోవటంలేదా—ఈ యేడుపంతా వీధుల్లో యెందుకంటాను నేను. ఆ యేడ్చే శృంగారమంతా నాలుగ్గోడల్లోముగుడన్నవాడికి—'పుస్తెకట్టినందుకు—అఘోరిస్తే చాలదా ?'

'కాస్త అందంవుంటే అది నలుగురూ చూడకుండా దాచుకోమంటావ్. పోపుల పెట్టెలోనూ, పొయ్యి వూదేటప్పుడూ, పిల్లలికి నీళ్ళు బోసేటప్పుడూ, నోములూ పూజలు పునస్కారాలు చేసుకునేటప్పుడు ఆడవాళ్లు చిన్నబట్టలు కట్టుకుని యింట్లో తిరగడం మానేస్తున్నారా ? మనవూళ్లో యింటప్రక్కావిడ యెన్నిమాట్లు గజంనర తువ్వాలు పీకకు

చుట్టుకుని పుదయమస్తమానూ యింట్లో దొడ్లో నూతి దగ్గర తులసికోట దగ్గర మడిపెలగబెట్టేస్తూండే - నేనెందుకైనా కాస్సేపు అటువెళ్తే నీ వెంత కొంకొరా చూసేదానివి? ఎవరి అలవాట్లు వాళ్ళకు నచ్చుతాయి. మనకు నచ్చని క్రొత్త సంగతులనేకం వుంటాయి. వాటి నస్తమానూ అసహ్యించుకుంటూ కూర్చుంటామా? '

పవిటచెంగు నోటికడ్డంగా లాక్కుంటూ —

' అయ్యో మీ కింకా జ్ఞాపకముందిటండీ అవిడ —'

' పాపం ఆయన పోయాడు తెలుసా? '

' అంత హఠాత్తుగా—పోకేం చేస్తాడు? ఆ యిల్లాలు చుప్పొద్దూ హింసించుకు తినేది. ఇప్పుడావిడ కింకేం కావలసినంత స్వేచ్ఛ-'

' అయ్యోపాపం—ఎంత చాకిరీచేసింది? అంతయినా చూస్తుండకుండాలేదు మహంకీ! గోలు గోలున యేడ్చేసింది. ఇప్పుడా మనిషే కాదు. '

' పోయేవాడు యెల్లాగూ పోతున్నాడు గనుక ప్రేమంతా వొక్కమాటు చూపించేసిందన్నూ? '

నవ్వుతున్నదల్లా చప్పున ఆగిపోయి సీరియస్‌గా —

' అల్లా మాట్లాడ్తావెందుకూ? మనుష్యుల కష్టాన్నిగూర్చి చెబ్తూన్నపుడు అంతహేళన పనికిరాదంటాను. నిర్దయగా సానుభూతిలేకుండా వుండటం గొప్పను కుంటున్నారు. '

' అవును. గొప్పనుకుంటున్నాను. '

' పోదురూ — బడాయిలు! '

' బడాయి కాదు....నీకు మనుకు నీకు తెలుసుగదా ఆవిడ యెంత పేరు గడించుకుందో, ఎల్లాటి పతివ్రతో—మళ్ళీ తగుదునమ్మా అని వెనకేసుకెందుకొస్తావు? ఇప్పుడు నీకావిడమీద జాలి కలిగిందికాబట్టి

నన్నుకూడా నీ వెనకాల తందానతాన పాడమంటున్నావు. అదే కుదర దోయ్—'

'మనుష్యులు ఎల్లాటివారైనా అకస్మాత్తుగాదూరప్పు వచ్చేస్తుంది. మునుపావిడ ఎల్లావుండేదేం—'

'— ఇప్పుడు భర్త రాలైందంటూ —ఆస్తి ఇల్లూ వగైరా అంతా వచ్చాక'

'అదేంకాదు —ఆ మొగుడు చాలా అన్యాయంచేశాడు. విల్లురాయకుండా పోయాడు. అన్నదమ్ముల బిడ్డలొచ్చి ఆస్తి ఆక్రమించుకు కూర్చున్నారు, ఈవిడకి మనోవర్తి అన్నా దక్కకుండా చేద్దామని చూస్తున్నారు, పాపం అడది. వ్యవహారాలేం యెరుగదు. మరో దిక్కు లేదు.—'

'మనిద్దర్నీ పెంచుకోమన లేకపోయావా?'

'అవునండి-ఆవిడ ఎవర్నన్నాదగ్గర తీసుకుని ఎందుకు పెంచుకోలేదు? యిప్పుడు చెల్లదేవిటండీ? రూపాయికి బిందె చొప్పున నీళ్లు మోస్తూ వంటలుచేసి పూరగాయలుపెట్టి కాలక్షేపం చేస్తూందండి! నాకు చూసినప్పుడల్లా కడుపు తరుక్కుపోయేది. నేనో రూపాయి పిలిచి యిచ్చేదాన్ని నెల నెలా—' ఆవిడ దారుణమైన నేస్తురాలి జీవితాన్ని తలుచుకుని కృంగిపోయింది. నిజమే ప్రపంచంలో దీనుల దుఃఖితుల గాథ లెన్నో-వుంటాయి. అన్నిటికీ చలించిపోయి బెంబేలు పడిపోతే మనం ఎట్లా జీవిస్తాం? ఆవిడ స్వభావం కొద్దీ భర్తను హింసించేది-బాధలు పెట్టేది. తన యిష్టం వచ్చినట్లు వుండేది. కాని ఆవిడ యెన్నడూ అతగాడ్ని వదలించుకుందామనిగాని అతడు లేకుండావుండాలనికాని కోరుకొని వుండదు. అవసరాలు తీరకపోయినా, ప్రేమలేకపోయినా, మనుష్యులు నిరంతరం యేకత్రితబడి ఒకే బోనులో నివసించడంవల్ల ఒకరు హఠాత్తుగా అదృశ్యమైతే ఆలోటును భరించలేరు. ఇది చాలా సహజమని నమ్మే అనుభవంలేని మా ఆవిడ నాకు సానుభూతి సంస్కారం లేదని విసుక్కుంటోంది.

మళ్లీ మద్రాసు హోటలుకొచ్చి భోంచేశాం. ఒంటరాపోయి సత్రవులో పడుకున్నాం. గుర్రాలుకూడా నెమరేస్తూ వుండి వుండి సకిలిస్తున్నాయి. న్యూఢిల్లీ స్టేషనులో డీసెలు యింజన్లు మొరపెడ్తున్నాయి. ఊరు నిద్రపోయింది బస్సులు అక్కడా అక్కడా తిరుగాడ్తూనే వున్నాయి. దీపాలన్నీ పదిగంటలకే సత్రవులో ఆర్పేస్తారు. మంచాలు లేవు—వరండాల్లో చాపలమీద దొర్లుతున్నాం. చెమట పోరాత్రివేళ 'ఆంధీ' వచ్చింది. దుమ్ము దుమ్ము - ఇసుక తుపాను. కిటికీలతలుపులు బడబడా కొట్టుకొంటున్నాయి. ప్రక్కదుప్పటి యెగిరిపోయింది. పట్టుకుందుకు పరిగెత్తి పిల్లలమీద పడ్డాను మొయ్యోమంటూ పిల్లలులేచి యేడుస్తున్నారు. దుమ్ము వాళ్ల ముక్కుల్లోనూ కళ్లల్లోనూ కొడ్తోంది. మా బావమరిది 'బావా నా లుంగీ యెగిరిపోయింది. ఎటో-' అని గోలపెట్టాడు.

గొంతుక కూర్చోమన్నాను. మా ఆవిడ పిల్లల్ని రెక్క పెట్టుగుని దగ్గరసా లాక్కొని కూర్చుంది చీకటని తిట్టుకుంటూ. దుప్పటి పట్టుగుని మా బావమరిది కిచ్చాను చుట్టుకోరా అని. గాలి వుధృతంగా వీస్తోంది. కొంత సేపటికి టపటపామని పెద్ద పెద్ద చినుకులుపడ్డం ఆరంభించాయి. ఈ దుమ్ము వచ్చాక ఆ పెద్ద చినుకులు వరండాలోకి కొడ్తూంటే అంతా లోపలికి గదిలో కొచ్చేశాం. పిల్లలు బిగ్గరగా బాకా పడ్తున్నారు మంచి నీళ్లు కావాలని. మా బావమరది ఎట్లాగో టార్చిలైటు వెదికి తీసి పట్టుగొచ్చాడు. మరచెంబు తీసుకుని స్నానాలగదివైపు జాగ్రత్తగా నడిచాను. అస్తవ్యస్తంగా వొళ్లు తెలీకుండా ఎంతమందో నిద్రపోతున్న మనుష్యుల్ని దాటి పంపు పట్టుకున్నాను. కాని లాభంలేదు. నీళ్లన్నీ ఎప్పుడో బందయ్యాయి. తిట్టుకుంటూ టార్చిలైటు ఆర్పుతూ వేస్తూ వరండాలో కొచ్చాను. ఎవరో తలదగ్గర కూజా పెట్టుకుని నిద్రపోతున్నారు. ముట్టుకున్నాను. చల్లగావుంది. గ్లాసుతీసేసి ప్రక్కనుంచి లైటార్పి కూజా యెత్తుకుని వేగంగా నడిచాను. పిల్లలు యింటావిడ అంతా దాహం తీర్చుకున్నారు. మళ్ళీ కూజా యెత్తుకుని వెనక్కువచ్చాను. కాని ఆ చీకట్లో యెవరి తలదగ్గర్నుంచి యెత్తుకొచ్చానో గుర్తులేదు. ఇంకా

ఎక్కువసేపు ఆ వస్తువును చేతులో వుంచుగోవటం అట్టే మంచిదికూడా కాదు. అక్కడే యేదో కిటికీలో వుంచేసి గబగబా దొంగలా మళ్ళీ మా గదికొచ్చి పడ్డాను. తెల్లారాక చెబితే మా ఆవిడ అంటుందిగదా పగలబడి నవ్వుతూ 'అవేంపనులండీ పాడుపనులూ-' అని. మా బావమరిది లుంగీ కూడా దొరికింది—అక్కడే ముక్కలకు చుట్టేసుగుంది.

## 3

ఉండవిచ్చిపోయిన దారపుబండిలా లుంగలు చుట్టుకుపోతోంది జీవితం. ఎవడో సగం చావమోది సైడుకాలవలోనికి గిరాటు పెట్టిన బురదపాములా గిలగిలా కొట్టుకొంటున్నాను. ఇంత చిన్నవుద్యోగం చెయ్యటానికి యిన్నివందలమైళ్లు రావలసివచ్చిన నా దౌర్భాగ్యం యేమని చెప్పుకోను? కూటికి గుడ్డకు పనికిరాని నా చదువు, నలుగుర్లో మెప్పుకు అందుకో లేని నా వెకలకపు బాహ్యవేషపు రీతులు- యిది నిరాడంబరతని నేను మురిసిపోదా మనుకుంటే వీల్లేకుండా, నలుగురూచూపే నిరాదరణ- దక్షిణాత్యుల మని ఆడే సూటిపోటిమాటలు అవహేళనలు....ఎన్నిటి కని తట్టుకునేది? మంత్రాలయపు అన్ని కార్యాలయాల్లోనూ తమిళకూటా యున్నాయి. ముఖ్యంగా పంజాబీలకి తమిళులకూ పొసగదు. హిందుస్థానీలు, యూపీలు, వీరికి పంజాబీలకు స్పర్థలు-తెలుగువాళ్ళు బహు క్లిష్టంగా ఆదరణా గౌరవమూ లేకుండా 'మద్రాసీ' లని పిలవబడుతూ యీ పెద్ద పెద్ద కూటాల మధ్యనలిగి, ఆత్మగౌరవమూ తెలుగుదనానికి తిలోద కాలిచ్చి యిటు తమిళులకు జోహారులంటూనో అటు ఔత్తరాహులకు 'జీ' హుజూరంటూనో బ్రతకాలిసిందే! ఒక జాతికి సరియైన ప్రాతి నిధ్యం బలం గౌరవం స్థానం కేంద్రంలో లేకపోవటంవలన నాబోటి సామాన్యుడు కాస్త అభిమానం వున్నవాడు మానసికంగా న్యూనత పాలవుతున్నాడు. ఇవన్నీ ఎందుకు చెప్పాలి వచ్చిందంటే- యీ కొంప కోసం తిరిగే చాంద్రాయణంలో కొందరు నన్నడిగిన అతి సామాన్య ప్రశ్నలు - తెలుగుప్రజలు వింటే,'హాయిషగానాలు - పూర్వప్రశంసలు' కట్టిపెట్టి నిజంగా మనకున్న గౌరవం ఎంతోమనం తెలుసుకున్నప్పుడు

- కాస్త తలవంచుకుని ఛాతీ విరుచుకోకుండా నడవటమే మంచిదనిపించు కుంటుంది.

నేను సబ్బుబిళ్ళ పెట్టి వాడటం చూసిన నా యూపీ స్నేహితుడు - 'ఓహ్హో! మీ దేశస్థులు కూడా సబ్బు వాడ్డం నేర్చుకుంటున్నారన్నమాట! ఐతే రెండు పూటలా స్నానంచేస్తారా!' ఒకరోజున మిఠాయికి నన్ను ఎవరో పిలిచారు. 'తొక్కుడులడ్డూ, బరఫీ, జిలేబీలు' యిచ్చారు. 'కచోడీ-సమూసా' ఖారం వేశారు. నేను తింటున్నంతసేపూ అతను నాజన్మలో అదే మొదటిసారిగా మిఠాయితింటున్నట్లు వూహించుకుని మాట్లాడ్డం మొదలెట్టాడు. తాము నెయ్యి విరివిగా వాడ్తామని - నాకు నాజాతికి నేయి, వెన్నలాటి వస్తువులు తెలీవన్నట్లు ప్రసంగించాడు. 'మీరు తమలపాకులు వేసుకుంటారా-' అనకుండా 'తమలపాకులు తెలుసా' అని అడిగాడు. 'పైజామా కళ్ళీ లాల్చీ' నేను కుట్టించుకోవడం చూసి—'మీరూ యీలాటి బట్టలు తొడుగుతారా?' నాకు నవ్వు మండుకుపోయింది. తాము బహు నాగరికులుగా విద్యావంతులుగా పరిగణించుకుని ఔత్తరాహులు వేసే ప్రశ్నలువిన్నాక-నాకు మన ఘనత రాజకీయ పరిజ్ఞానం, సారస్వతం, యిత్యాది విషయాలపట్ల యేర్పడ్డ మమకారం దెబ్బతినడమే గాకుండా, మన లోపాలు కష్టాలు కారణాలు ప్రస్ఫుటంగా గోచరించసాగాయి. మరొకరు మీ దేశంనిండా ముష్టివాళ్లు —అడుక్కోడానికికూడా యింత దూరం వస్తారు అని నేను యథాలాపంగా దారిలో ఎవరికో కాణీ ధర్మం చేస్తుంటే మనస్సు కలుక్కుమనేలా అనేశాడు. నిజమేమరి—బెజవాడలో, విశాఖపట్నంలో ఒక చోటేమిటి రైళ్ళలో ఎక్కడపడితే అక్కడ, ముఖ్యంగా హోటళ్లయెదుట ఎంతమంది ముష్టివాళ్ళు? ఎల్లాకాదనగల్ను?

నా జీవితం నడివీధిలోకొస్తే, నేను బ్రచించుకుంటూ 'కన్నాట్ప్లేసు' లోపలి సున్నాలో చక్కర్లుకొడ్తుంటే 'కేశవరావు' కలిశాడు. అతను నన్నుచూడగానే బస్సుకోసం నిలబడ్డ క్యూలోనుంచి యీవలకు వచ్చేసి నా రెండు చేతులూ పుచ్చుకుని ముఖంకాస్త ముందుకువంచి 'ఎన్నాళ్ళ కెన్నాళ్ళకి?' అంటూ పేవుమెంటు షాపుల్లోకి లాక్కె-

ళ్ళాడు. ఇద్దరం కోలాకోలాలు పుచ్చుకున్నాం. పనామా సిగరెట్టు ముట్టించాం.

'ఇప్పు డెక్కడా యేమీ రాయటం లేదే—' ఒకప్పుడితను నాకు ఫాను. ఉత్తరాలు తెగరాసేవాడు. మూడోవాడి రచనల్ని యెప్పుడూ చీల్చి చెండాడ్డం అప్పట్లో హాబీ మాకు. అప్పటికే తెలుగుపాఠకుల్లో వంటింటి కథలూ, అబ్బాయి అమ్మాయిల బాధలూ. విడోమారేజి, కులతత్వాలమీద రచనలూ, గుమాస్తా గాథలూ చదివి చదివి విసుగెత్తి పోయి వున్నారేమో ఏదన్నా 'క్రొత్త' కోసం తహ తహ లాడిపోయే వాళ్ళలో కేశవరావు వొకడు.

'అప్పుడు మీరు చక్కగా 'హాస్యం' రాసేవారు?'

'ఇప్పుడు మేడుపులోపడి కొట్టుకుంటున్నాను, తప్పితేఖీభత్సం-'

'అల్లాఅంటారేమండీ? —'

'ఇదుగో అబ్బాయి—యిదివరకు ఏదో బరికేసి ఆ వెనక సంపాయించుకున్న పేరునే పొదుపుగావాడుకునే వాళ్ళలో నేనొకణ్ణి. సరేనా—'

కేశవరావు పగలబడి నవ్వాడు.

'మాస్టారూ—యిక వ్రాయండి, ఇక్కడి కొచ్చేసారుగా—'.

కేశవరావు 'మాష్టారూ' అనగానే అతడి ముఖంలోకి చూశాను.

ఒకప్పుడితను నా దగ్గర చదువుకున్నాడు.

'పెళ్లాడావా?'

'అబ్బే—నా కెవరిస్తారండీ?'

'ఉద్యోగం?'

చెప్పాడు. ఎయిర్‌లైన్లో ఏదో విదేశీకంపెనీ మానేజరుకి పి.యే. గా వుంటున్నాడుట—ఏడు వందలు. మొదట్లో స్టెనోగా చేరాడు. ఇంటరు పూర్తి చెయ్యలేదు. చదువుతూంటే తండ్రిపోయాడు. అన్నగారితో

వదినతో తగూలాడి బెజవాడనుంచి పారిపోయాడు అప్పట్లో. ఇతనస్తమానూ మా యింట్లోనే వుంటూ యిక్కణ్ణే భోం చేస్తూండే వాడు యింట్లో పోట్లాడేసొచ్చి, నా సైకిలు అస్తమానూ పట్టుకుపోయేవాడు. నాకు సిగరెట్లు పోస్టుబిళ్ళలు కాగితాలు తెచ్చిపెట్టేవాడు. ఎప్పుడన్నా చిత్తు సాపు రాసేవాడు, కథలు పోస్టుచేసిపెట్టేవాడు. ఇతరులతో నా వ్రాతలగురించి పోట్లాడేసొచ్చేవాడు. నేను కూడా సినిమాలకు తీసుకెళ్ళేవాడని.

క్లుప్తంగా కేశవరావుతో నా సంగతి మా ఆవిడ బావమరిది పిల్లలు వచ్చిన సంగతి అంతా సూక్ష్మంలో బోధపర్చి చెప్పాను.

'ఐతే — నా గది యిచ్చేస్తాను. మా కూడు కొచ్చేసెయ్యండి. తర్వాత యెక్కడన్నా చూద్దాము.'

నేనూ కేశవరావూ సత్రవులోకొచ్చిపడ్డాము, మా యింట్లో యావన్మందికీ కేశవరావు తెలుసును- నా భార్య 'ఏమోయ్-తప్పుకదూ-అల్లా పారిపోవచ్చా యెవరికీ చెప్పకుండా....మళ్ళీ బెజవాడ వెళ్ళావా మీ అన్ననూ వదిననూ చూసేందుకు ?'

అతను ముసిముసిగా నవ్వుతూ నిలబడిపోయాడు. 'ఈ వేషం సూటు బూటులో పోల్చుకోలేకపోయాను' అంటూంటే వారించి చెప్పాను- 'మునుపటి కేశవరావు అనుకునే మాట్లాడేస్తున్నావు నోటికొచ్చినట్లు, అతను యేడువందలు సంపాయిస్తున్నాడు. ప్రయోజకుడయ్యాడు. సంతోషించు.'

'నిజంగా !' ఆశ్చర్యపోయింది. కేశవరావు అంత ప్రయోజకుడవుతాడని యెవరూ నమ్మలేని విషయం. 'ఎందుకండీ మస్తారూ — అవన్నీ చెప్పేసారు. సన్నిక్కడయెవరు చనువుగా కేకలేస్తారు చెప్పండి. నేను సరదాగా వింటూంటే —'

అంతా కేశవరావు గదిలో కొచ్చిపడ్డాం. ఆ గది కటాల్‌బాగ్‌లో మూడో అంతస్తులో ఒక మేడలోవుంది. అక్కడ మీదనే అన్ని సౌకర్యాలూవున్నాయి. మా ఆవిడ తన అమాయకత్వంలోనే తమ్ముడికికూడా

కేశవరావులా ప్రయోజకుడు కావటానికి యేదన్నా చూసిపెట్టమని రోజూ అతడితో చెప్పిపెట్టేది. అతనువున్న ఒక్క గది చిన్న వరండా అంతా మాకోసం వదిలేశాడు. పిల్లలు వంపుత్రిప్పి అస్తమానూ క్రిందపడచ్చునే వాడు. అతడూ మాతోనే భోజనాదికాలు చేయటానికి వప్పించేసరికి చాలాకష్టమయింది. పెసరట్లు వడలు బజ్జీలు యిడ్లీలు ఒకటేవిటి యింటిలో రోజూ ఆంధ్రత్వం మళ్ళీ విజృంభించసాగింది.

ఒక రోజు కంపెనీకారు తీసుకొచ్చాడు. మా బావమరిది, పిల్లలూ మా విడ బిలాబిలా అంతా అందులోకెక్కారు. నేనేమో యిల్లు చూస్తానని వుండిపోయాను. కేశవరావు అందర్నీ తిరగడానికి తీసుకుపోయాడు. జీవితం కాస్త రాస్తాలో పడ్డట్లేవుంది. వరండాలో వాలు కుర్చీ లాక్కొని సిగరెట్టు కాలుస్తూ పేపరుచూస్తున్నాను. స్టూలుమీది పేజీలు ఫానుకు వుండి వుండి తపయన్వాలు చుద్దున్నాను. గాలి మెల్లగా వస్తోంది. శరీరం బట్టనుకూడా వోర్చలేని కాలం ఇది. ఈగది మీద నుండేమో - చుట్టూతా రకరకాల మేడలు కిటికీలు ద్వారాలు చిన్నచిన్న బొమ్మల్లా కనుపించే మనుష్యులూ - రోడ్లు దొడ్లూ మొక్కలూ బాగా దిగువను చీమల్లా పరుగెట్టే బళ్ళూ కారులూ అన్నీ మధ్యమధ్యన అవలోకిస్తున్నాను.

ఈ గొర్రెతోక బెత్తెడు జీతంతో ఈ పిల్లల్ని ఎట్లా పెద్దవాళ్ళను చేస్తాను? వీళ్ళకి చదువులు బట్టలు రోగాలు రొష్టులు ఇవన్నీ నేను ఎట్లా భరిస్తాను? ఇంత చిన్నవయస్సులో నాలుగూ చూడాలనీ అదీఇదీ కావాలనీ తెలిసీ తెలియకుండా అడిగే ఆడదాని మనస్సు నొప్పించకుండా వుండగలనా? కేశవరావు మంచివాడే. ఇట్లా అతని పీకలమీద ఎన్నాళ్లు కూర్చోవటం? ఆ మేడమీది అంతరిక్షంలోని గదికి అతను యాభై రూపాయ లిస్తున్నాడు. నాకు తెలీకుండానే నేను నా జీవితంతో అతడి జీవితాన్ని పోల్చుకుందు కుపక్రమించాను. నాకు జీవితంలో సంతోషంగా ఆనందంగా గడచిపోవలసిన కాలంలో సంసారం పెద్దదయి వుద్యోగం చిన్నదయి అంతా తిరగబడిపోయింది. కేశవరావు చిన్న

తనంలో కష్టపడ్డాడు నాకు తెలుసు. కాని ఇప్పుడు మంచి పదవిలో వున్నాడు, ఒక్కడు ! కావలసినంత డబ్బు — మరో యేడాదిలో పెళ్ళాడినా సమస్యలేం లేవు. హాయిగా సుఖంగా జీవించటానికి ప్రాతిపదిక అప్పుడే యేర్పడివుంది. కోరికల్ని చంపుకోనక్కర్లేదు. నాకు—అట్లాంటి దేంలేదు, చిన్నప్పుడేపెద్దవారిముచ్చటకోసం పెళ్లాడేశాను. చదువు పూర్తి గాకుండా వంశోద్ధారణకు కొడుకు—కంగారుపడి ఏదో వుద్యోగమని ప్రవేశించాక, ఆశయాలు అభిరుచులు కోరికలు అన్నీ మెల్లగా వొక్కటొక్కటీ తిరుగుముఖంపట్టాయి. ఇంట్లో పాలపీకలూ, యే మూల చూసినా పొంగుడ్డలూ, అటకమీద బస్తాలతో గొల్లభామ మార్కు పాల డబ్బాలు, ఒక ప్రేమడైలాగన్నా చెప్పకుండా ఒక యుగళగీతమన్నా పాడకుండా ఇంత ముందుకుపోతుందని యెవరనుకున్నారు? ఒంటరిగా కూర్చుంటే ఇలానే దిగులుగా వుంటుందని వరండాలో కుర్చీలోనుంచి లేచి లోపలకువెళ్లి స్టవ్ ముట్టించాను — ఒక చుక్క కాఫీ గొంతుకలో పోసుకుంటే యేమన్నా మనస్థిమితంగా వుంటుందేమోనని. నే నింకా కాఫీగొంతులో వుంటూండగానే వరండాలోనుంచి కోమలకంఠం 'నాకు కూడా మరోకప్పుకాఫీ పొయ్యి డార్లింగ్' అని వినిపించింది. బైటకు వచ్చి చూద్దునుగదా బంగారు మొలకల్లే ఒక పంజాబీ అమ్మాయి నా; కుర్చీలో కూర్చొని జోడు విప్పుతూన్నట్లా నా క్రొత్తమొహం చూసి—తెల్లతెలబోతూ 'కేశీ—యిప్పుడీయింట్లో లేరా?' అనిలేవబోతూ అడిగింది. 'కూర్చో అంతాచెబుతా —' అన్నాను. నివ్వొచ్చేవుండి. నీకోసం కూడా మరోకప్పు కాస్తాను, కేశీ వస్తాడు. వచ్చేదాకా వుంటావా? 'ఎవరో వస్తారని చెప్పాడు. కాని ఆడా మగా చెప్పలేదు' అని లోపలికెళ్ళాను, ఈ అమ్మాయిఎవరో ఏవిటో తెలుసు కోవాలని చెడ్డకుతూహలంగా వుంది. నీళ్లు ఎక్కించి మళ్ళీవచ్చి—'కూర్చో అమ్మాయి. పరవాలేదు. మావాడు నాకంతా చెప్పాడు. నే నెవరనుకుంటున్నావో—ఈ చేత్తో అరవై డెబ్భై ప్రేమ కథలు రాశాను. మనకి అన్ని కథలూ సుఖాంతంచేయటం ఎట్లాగో తెలుసు ?'

ఆ అమ్మాయి కాస్త నవ్వి 'కేశీ — యెక్కడి కెళ్ళారు?' అంది. 'నేనే పంపించాను — అస్తమానూ ఇంట్లో కూర్చుని నువ్వు రాలేదని తెగ యిదవుతూంటే, అల్లా తిరిగివస్తే కాస్త మనస్సు కోలుకుంటుందని.'

'హూ! సారీ —' అని మూతికాస్త చిన్నదిచేసి పెదవుల్ని వంకరగా త్రిప్పి — మెడ కొంచెం అటూ యిటూ వూచింది.

'బావుంది అమ్మాయ్ — నువ్విట్లా మావాడికి కొత్తగా కనిపించటమే మానేస్తే యేమన్నా బాగుంటుందీ! అస్తమానూ యిప్పుడు నువ్వు 'కేశీ— కేశీ' అంటున్నావా, అటాగే వాడూ ఏదో గొణుగుతాడూ ఫోటో దగ్గర పెట్టుకుని' కాఫీ కప్పు బల్లమీద వుంచుతూ 'ఫోటో'— అది మీకెట్లా తెలుసు?' కాస్త సీరియస్‌గా అడిగింది, అల్లా బైటపడూ పిల్లా అని మనస్సులో అనుకున్నాను. వాలకమే చెబ్తోంది వర్కింగ్ గర్ల్ అని — కుర్రవాడు నాలుగు రాళ్ళు సంపాదిస్తున్నాడు గదా అని యిట్టే బుట్టలో పెట్టేసుంటుంది. ఐనా శుభ్రమైన 'కో' అంటే కోటిమంది తెలుగుకన్య లుండగా మావాడి కిదేంబుద్ధి? పెళ్ళాడ తానంటే — అప్సరసల్ని తలదన్నే జాతి కన్యల్ని తెచ్చి అంట కడుదుమే. నా కెందు కీవిధంగా కేశవరావు తరఫున పెద్దరికం నిర్వహించాలనీ, అతడి బాగోగులు వ్యవహారాల్లో ప్రమేయం పెట్టుగోవాలని గలిగిందో చెప్పటం సులభం. ఆ అమ్మాయి మళ్ళీ అడిగింది— 'ఫోటో మీకు తెచ్చిచూపావా?' అని.

'అరె — నువ్వెంత అమాయకురాలివి? మేమిద్దరం భౌతికంగా వేరుగాని మా ప్రాణాలుఆత్మలు సర్వం వొహటే — నేను చూసి అన్నాను గదా యీ అమ్మాయిని మాపిక్చర్లో బుక్‌చేస్తే హీరోయిన్‌గా చాలా బాగుంటుంది — హిందీలో డబ్ చేసేటప్పుడు' అన్నా, సినిమాలంటే అమ్మాయిలు చెవిగోసుకుంటారని నాకు తెలుసు. 'మీరు సినిమాలు తీస్తారా?' అంది కళ్ళువీలయినంతగా పెద్దవిచేసి. నేను 'పిల్లా — సినిమాలు తీసే మనుష్యులు యిల్లా ఎందుకుంటారు? ఇల్లాటి చిన్న ఆరేడు వందలు సంపాయించే 'కేశీ' లాటి వాళ్ళతో ఎందుకువుంటారు? నేను నీకు ముందే చెప్పానే సినిమాలకు కథలు వ్రాస్తానని. ఇప్పుడు 'వర్కింగ్ గర్ల్'

చిత్రానికి పరిచయిస్తున్నాను. ఆలోచిస్తూ యిల్లా కూర్చున్నానో లేదో నువ్వొచ్చావు?'

అపిల్ల వాస్తవ నిందాగర్భితంగా చేయిల్ని త్రిప్పుతూ—'చూశారా అందుకే మీరు వచ్చాక నాకు రావద్దనికూడా కబురుచేశారు. ఐనా చూద్దామని యిటొచ్చాను. నేను సినీమాలోకి దొరుకుతానా?'

'నాకు నచ్చబట్టే ఫోటోలో అమ్మాయిని గురించి మావాడి నడిగి తెలుసుకుంది, సినీమా పేరు మా కంపెనీవారు 'టైపిస్టు గర్ల్' అని పెడ్తామనుకుంటున్నారు? నాకేమో ముందుపేరే నచ్చింది'.

'మీకు నాఫోటోలు కొన్ని పట్టుగొచ్చి యిస్తాను. మీకంపెనీకి రాయండి నచ్చుతానేమో. ఈకైపు కొట్టలేక ప్రాణం విగిసిపోతోంది.'

'అమ్మ బాదో—యింకేమన్నా వుందా! మా కేశవరావుకు తెలిసిందంటే, నాప్రియురాల్ని సినీమాల్లో ప్రవేశపెడ్తావా అని నా పీకనుచ్చు గుంటాడు. ఐనా మీరిద్దరూ ప్రేమించుగున్నారేమో, అతన్ని కూడా అడిగి చూస్తేనే బాగుంటుంది.'

'కేశికి మీరేమీ చెప్పొద్దు. ఆయనకు నేనే సావకాశంగా అంతా చెబ్తాను. నేను యిక్కడకు వచ్చానని చెప్పకండి, నేనూ చెప్పను. ధన్యవాదాలు—మీలాటి గొప్పవాళ్ళని కలిసే అదృష్టం కలిగినందుకు నిజంగా నేను గర్వపడుతున్నాను. సెలవు.'

ఆ అమ్మాయి నాజూకుగా వచ్చినట్లే నిష్క్రమించిండి. అంత సేపూ మేమిద్దరమూ హిందీలోనే మాట్లాడాము. నేను కుర్చీలో జార్లబడి పగలబడి నవ్వుకున్నాను. ఎన్నాళ్ళ తర్వాతో నాకు జీవితంలో నిజమైన హాస్యం కళ్ళకు గట్టినట్లు కనిపించింది.

ఇక్కడ మీకు అనేక సందేహాలు కలుగుతాయి. నిజంగా నేను యింత చాకచక్యంగా హాస్యం మాట్లాడ గల్గివుంటానా, తర్వాత ఆ అమ్మాయి ఫోటోలు తెచ్చిందా? మళ్ళా ఆ పిల్లను కలుసుకునే ధైర్యం

నాకుందా? నా కొంపవిషయం యేమైంది? మా బావమరిదికి వుద్యోగమైందా? ఈసోది ఎప్పటికన్నా ముగుస్తుందా అని.

బాబూ నన్ను కాస్త చెప్పనియ్యండి!

ఇప్పుడు వచ్చి 'ఫ్లా' అధ్యాయంలో పడ్డాం. ఈ 'ఫ్లా' కథలోకి రాకముందు ఆ అమ్మాయి ఒక రోజున ఫొటోలు పుచ్చుకుని నాకోసం వచ్చిందట, అప్పుడు నేనూ—కేశవా యిద్దరమూ యింటిదగ్గర లేము, మా శ్రీమతి పిండి రుబ్బుతున్నది కాబోలు, దానికి హిందీ బొత్తిగా రాదు. ఆ అమ్మాయి ఏవో వాకబులు చెయ్యటం, యీ మనిషి తెలుగులో మాట్లాడ్డం అయాక, రుసరుసలాడ్తూ వెళ్ళిపోయిందని మా ఆవిడ కథనం.

ఈలోగా నాకు తెలియని కథ కొంత మా ఆవిడ కూడా జరిపించింది. ఆవిడకు 'పెళ్లి ట్రయినింగు' పొందుతున్న ఒక చెల్లెలు వుంది. దాన్ని తీసుకుని వచ్చి రెక్కలు కట్టుకు వాలమని మా మామగారికి జాబు వ్రాయించింది—' ఇక్కడ రత్నంలాంటి కుర్రవాడున్నాడు. ఏటుపంటయి నెలకు—లొట్టి విరగ్గొట్టండి. నేతిలో పడెయ్యండి' అని, నా కొంప విషయంకూడా—ఇది 'ఫ్లా' అధ్యాయంలో చేరుతుంది, 'కేశవ'ని వాళ్ళ ఆఫీసులో ఒకరు బ్రతిమాలగా బ్రతిమాలగా వప్పుకున్నాట్ట—ఆయన మూడు నెలల శలవులో మద్రాసు వెళ్తున్నప్పుడు ఆయన కొంప దొంగలుదోచకుండా రక్షించేటందుకు. రెండు పడక గదులు, రెండు బాత్‌రూంలు, బాత్‌రూంలో నిలువు టద్దాలు (ఎందుకని అనవసరపు ప్రశ్నలు వెయ్యకండి,) ఒక స్టోరు రూం—ఒక డ్రాయింగు రూం—గది గదికీ ఫాను—వగైరా, వగైరా. దమ్మిడీ అద్దె లేకుండా, నీటి కరువూ, వెల్తురు కరువూ, గాలి కరువూ, లేకుండా మూడునెలలు సకల రాజభోగాలూ అనుభవించమని కేశవరావుచెప్పాడు. తర్వాత 'దేఖా జాయెగా', అస్సలు విషయం ఆ ఆఫీసరు కుటుంబం యావత్తూ మద్రాసులో 'ఫ్లా' సుఖం అనుభవిస్తున్నారట!

టంగుటంగామని మేడమీది గదిన్నర కేశవరావు వాటాలోంచి పడకగదికీ పడకగదికీ మధ్య లావేటరీ బాత్‌రూంగల బంగాళాలో కొచ్చి

పడ్డాం, కేశవరావు ఎందుకీ సదుపాయం చేశాడో నాకు పూర్తిగా తెలుసు, ఆ పంజాబీ అమ్మాయి నా చమత్కారమంతా కేశవకు చెవిగొరికి వుంటుంది, నా కళ్ళముందు కుర్రాడు. బైటపడలాడు. ఇదేమి చెప్పయని నా పూర్వకాలపుటిల్లాలు కేశవరావు యింతకాలం పెళ్ళిచేసుకోనిది తన యెదిగిన చెల్లెల్ని సేపట్టడానికనే పూ్రకలలుగంటోంది. కలియు మంచికే అంటారు మన స్త్రత్వశాస్త్రవేత్తలు.

ఇక్కడేం జరిగిందంటే —

బంగళాలో రాజాలా వుంటున్నామని చెప్పానా - గేటుమీద 'సుబ్బరామన్' అని రాసుంది. ఆయన అనుకోకుండా విమానం మీద యావత్తు సంసారంతోసూవచ్చి పడ్డాడు. (విమానంమీద వస్తాడని ఎల్లా, అనుకుంటాం చెప్పండి! మూడు రోజులు నడుములు పడిపోయేలాగ జీ. టీ, లో రాక.) అప్పుడు మా బావమరిది రేడియో ట్యూను చేస్తున్నాడు. మా మరదలు పిల్ల పెళ్లి చూపులకోసం వచ్చినది!

'నేనే జాణనా-

చిన్నదాన్నైనా.... నే నేజాణనా! ఏలుకో నా స్వామి నా తమి దీర్చేటందురా....'

హార్మనీమీద సాధకం చేస్తున్నది,

నేను చిన్నతువ్వాలు చుట్టుకుని బాత్‌రూంలో అఘోరిస్తున్నాను, మా ఆవిడ వంట యింట్లో చుంయ్ చుంయ్ మనిపిస్తున్నది,

అ సుబ్బరామన్‌గా రెవరో మాకు తెలీకపాయె! ఆయన ముఖం వొలిచిన ఎర్ర పంపరపనసకాయలా వుంది, ఆ యిల్లాలు దక్షిణాది పట్టుచీర కట్టుకున్నది, ఇద్దరు అమ్మాయిలు చిన్న చిన్న హాండ్‌బాగ్‌లు పట్టుకుని నిల్చున్నారు. నేను కాస్త కథకుణ్ని గనుక యిది ఫలానా అని గ్రహించుకుని-'సార్! సార్!' అని వినయంగా యీయిల్లు జాగ్రత్త కోసం ఏయిర్ లైన్స్ పి. యె, గారు మమ్మల్నిక్కడ వుండమని మరీ

గట్టిగా చెప్పారు. తమరు చెప్పకుండా వచ్చారు. బినా మీ యిల్లు భద్రంగా చూడ్డానికి పేంపడ్డ అవస్థ వర్ణనాతీతం. చూడండి ఆ మొక్కలు లతలూ అవీ చిగురించాయంటే యీ చేతుల్తో నీళ్లు మోసి మోసి మా యీవిడ—'

'పి. య్యే. ఎవరూ? నేనే పి. య్యేకు చెప్పలేదే-మిమ్మల్నింటిలో ఎవరుంటమన్నారు?'

మనిషి యింకా గర్జించటం మానలేదు.

'మీ వస్తువులూ సామానులూ అన్నీ సరీగా వున్నాయో లేవో చూసుకున్నాకే మమ్మల్నిక్కడ నుంచి పొమ్మనండి. మేం మీ యిల్లు జాగ్రత్తకోసం యింటిలో వున్నామని నేను నొక్కి చెబుతున్నాను. మీకు మరోలాతోస్తే మీరు పోలీసులకు కబురు చెయ్యొచ్చు!'

ఈ లోగా మా యావిడ గరిట చేత్తో పుచ్చుకుని రంగస్థలం మీదకు వచ్చింది. నేను సంతోషం కనబరుస్తూ 'సుబ్బరామన్‌గారు వచ్చారే-వప్పుడు కాఫీలు చేసిపెట్టు. అమ్మా యిక మీరు మీ యింట్లోకి వెళ్ళండి. ఎప్పుడు యీ బాధ్యత నాతలమీదనుంచి తప్పుతుందా అని దేవుళ్ళకు మొక్కుతున్నాను. మీ వస్తువు లన్నీ సరిగా వున్నాయో లేవో ముందు చూసుకుని మాకు సెలవిప్పించండి.' అని మా బలగం యావత్తూ తలొక వస్తువూ పట్టుకుని శ్రీ వారి సామాన్ను బంగళా అంతర్భాగంలోకి చేర్చాము. సుబ్బరామన్‌గారు చిరాకుగానే వున్నారు. కాఫీలు పడ్డాక ఆయన మళ్ళీ చిరాగ్గా 'మీకు తాళాలు ఎవ రిచ్చారు?' అన్నారు.

'మీ. పి. ఏ.'

'నా పి. ఎ. ఎవరు? నేను నా ఫ్యాను కిచ్చానే—'

'మీ ఫ్యాన్ పి. ఎ. గారి కిచ్చివుండొచ్చు'

'డామిట్—నే నే నయ్యా పి. ఏ ను, నా ఫ్యాను కేశవరావనే కుర్రాడి కిచ్చాను.'

'కేశవరావు ఫ్యానా....' నాకు షాకు తగిలి నట్లయింది. 'తాను పి. ఏ. నని పదుపంపలు జీతమని నాతో చెప్పాడు.'

'వెధవ.—'

'సుబ్బరామన్‌గారు సోఫాలో ఉండలు చుట్టుకు పోయారు నవ్వు ఆపుకోలేక. ఆయన తన కుటుంబంలో అందర్నీ పేరు పేరు వరసల్నా పిలిచి యీ సంగతి చెప్పి వాళ్ళందర్నీ నవ్వించారు.

నేను కొయ్యబారిపోయాను. మా ఆవిడ మొఖాన కత్తివేటుకు నెత్తురు చుక్కలేదు.

సుబ్బరామన్‌గారికి నా కథంతా పూసగ్రుచ్చినట్లు చెప్పాను. కేశవరావు నా దగ్గర యేమీ డబ్బుకూడా తీసుకోలేదని కేవలం 'ఇల్లు జాగ్రత్త'గా చూడమని మాత్రం చెప్పాడనిఅందుచేత ఇంకేమీ చెయ్యొద్దని నేను తిరిగి యేసప్రవుకో మకాం యెత్తేస్తానని సవినయంగా చెప్పు గున్నాను.

సుబ్బరామన్‌గారు ఫోను రింగుచేసి సుందరం కేశవ విషయం అడిగారు. తరువాత యేమి విన్నారో, నన్ను మాత్రం కేశవ యిల్లు చూసి రమ్మన్నారు. నేను బయల్దేరుతూంటే మా ఆవిడ కళ్లనీళ్లు బెట్టు గుంటూ 'ఇదంతా యేమిటండీ?' అని దారి కడ్డంవచ్చి నిల్చుంది. 'జీవితం' అని గబగబా రోడ్డుచ్చుగున్నాను. బస్సులో సీటు దొరికేసరికి ఆలస్యమయింది, నేను వెళ్లేసరికి మేడ మెట్లవద్ద పోలీసులు వున్నారు. జనం గుంపు మాత్రం క్రింద పోగయింది. నన్ను సుబ్బరామన్‌గారు పంపించారని పైకివెళ్ళనిమ్మనీ చెప్పాను. నేను మీదకు చేరేసరికి చూసిన దృశ్యం తాలూకు సందర్భం యిది.—

ఆ పంజాబీ అమ్మాయి నన్ను చూసింది. కళ్లు ఎర్రగా వాచి వున్నాయి, ఏడుస్తోంది, గదిలో సామాను లన్నీ చిందరవందరగా పడేసి వున్నాయి. పోలీసు సిబ్బందీ సిగరెట్లు కాలుస్తూ తీరిగ్గా మాట్లాడు కుంటున్నారు.

'కేశవా' అన్నాను గొంతెత్తి.

చిన్నప్పుడు నేను యిట్లాగే మందలించేవాడిని వాడు యింట్లో తగూలాడేసి వచ్చినప్పుడు.

...—వాడి చేతికి బేడీలు వేసివున్నాయి.

నన్ను దగ్గరసా రమ్మని సంజ్ఞచేశాడు, వెళ్లాను.

'ఒక సిగరెట్టు యివ్వండి. చూస్తారూ—యిప్పుడు చేతుల్లేవు.'

సిగరెట్టు అంటించి యిచ్చాను నోటి దగ్గరకు.

'జైల్లో బీడీ ముక్కలన్నా దొరకవు.'

'ఏమిటిదంతా-ఏం చేశావు?'

'నన్నడక్కండి.'

'నాయనా-యిదంతా నా కోసమేనా?

నాకు కళ్లల్లో కృతజ్ఞతలో నీళ్ళ తిరుగు తున్నాయి. చేయిచాయితో వొత్తుగుంటున్నాను.

'సుబ్బరామన్‌గారు చాలా మంచివారు. నన్ను కన్న కొడుకులా చూసేవారు. ఆయన యిల్లుజాగ్రత్తగా వప్పగించేశాక మీ రింములోకి వచ్చి వుండండి. ఈ సామాను అంతా యిక మీది, ఇందులో పూచిక పుల్ల యెవర్దీ లేదు. నిన్న మీ మనదలు కోసం చోళీగుడ్డ పిల్లలకు పిప్పరమెంట్లు తెచ్చాను. యీ పోలీసులు చిందర వందర చేసేశారు. ఎక్కడో వుంటాయి, అవి వాళ్లకివ్వండి. ఇల్లు జాగ్రత్త!'

'ఇవ్వేం మాటలు నాయనా—'

నా గుండె తరుక్కుపోతుంది. పంజాబీ పిల్లను చూపించి 'ఇది నే నేమో స్వర్గాలు వొరగబెడతా ననుకుంది. నన్ను మర్చిపొమ్మని పెళ్లాడి సుఖపడమని మీరు చెప్పాలి తర్వాత! పోలీసులు నాతో కొంత సేపు మాట్లాడారు. కేశవ వాళ్ళకు ఆ యిల్లునాకు వప్పగించ మని చెప్పాడు. వాళ్లు అతణ్ణి వానులోకి తీసుకు పోతూంటే నేనువెళ్లి 'కేశవా' అని గట్టిగా కావలించు గున్నాను. పోలీసులు విసుదుగా లాగి

త్రోసేశారు నన్ను. ఆ పంజాబీ పిల్ల పట్టుకుంది. ఇద్దరం మెట్లమీద కూర్చుని కాస్సేపు యేడ్చాం. ఇంటికి కాపలా వున్న పోలీసులు మధ్యాహ్నానికి తాళాలు లిస్టులు నాకు వప్పగించి సంతకాలు తీసుకున్నారు.

సుబ్బరామన్‌గారు తర్వాత అంతా చెప్పారు. విమానాల్లో కొన్నాళ్లనుంచి యితర దేశాలనుంచి దొంగతనంగా వస్తువులు వెండి బంగారం నల్లమందు కొని తెబడుతూన్నదట. దానికి సంబంధించిన ముఠాానికి చెందిన ప్రముఖవ్యక్తి 'కేశవ' అని కస్టమ్స్ శాఖ పట్టుకున్నారని. ఆయన కూడా 'కేశవ' నిజాయితీ పరుడే కాని - భారీ యెత్తున డబ్బు సంపాయించే వ్యాపారంలో చేరటం బహుశా దారిద్ర్యంవల్ల కావచ్చునని తేల్చారు.

మేం యిప్పుడు కేశవగదిలో మీదన మేడమీద వుంటున్నాం. మా బావమరిదికి సుబ్బరామన్‌గారు వుద్యోగం వేయించారు. అన్నట్లు చెప్పటం మరిచాను. 'యీ యింటికి కేశవ మూడేళ్ళ డబ్బుకట్టి కంట్రాక్టు రాయించుకున్నాడుట. అందుచేత మాకే పూచీలేదు. మా మరదలు సంగతి అడుగుతున్నారా? చెప్పను మా ఆవిడ అంటుంది గదా 'ఇంకా నయం వాడి మాటలు నమ్మి దీని గొంతుక కోశాం గాదు' అని.

ఆ పంజాబీ అమ్మాయి ఒకరోజు బజార్లో కనిపించి చేతివ్రేళ్లు నొప్పు లెడుతున్నాయని తన చేతుల్ని నాకు చూపించి మాటల సందర్భంలో—'ఏదన్నా కథ వ్రాసి పెట్టండి' మా మీద అని అడిగింది. ఒక రోజు సినిమాహాల్లో కనిపించింది: ముందు 'రో' లో. భుజంమీద తట్టాను. వెనక్కు తిరిగి చూసింది. 'ఎల్లా వున్నావ్? కాస్త నవ్వింది.

ఈలోగా తెరమీద బొమ్మలాడ్డం ప్రారంభ మయింది.

# అనురాగమాలిక!

'దీని కేదన్నా వుపాయం చూద్దురూ?' అని అడిగింది అమ్మడు మొగుడ్ని గోప్యంగా—

'చేనికే....' అంటూ అబ్బులు చిరాగ్గా అరిచాడు.

ఆవిడ కొంచెం అయోమయంగా—'మళ్ళీ....'

'మళ్ళీ?'

'హూ!'

'అదేం?'

'తిప్పుతున్నట్లుగా వుంది.'

'నిజంగా—'

'ఏమో....!'

'సరిగ్గా యేడవ్వే బాబూ? అనుమానాల్తో చంపక.'

'అనుమానమేవిటండీ? ఘస్తూంటే—'

'దిక్కుమాలిన్నంత-యిహ యీ కొంపలో బ్రతకక్కర్లేదు.'

'నేనేం చేశానండీ?'

'నలుగురూ నవ్వుతారు. ఇట్లాగైతే ఎట్లా గడపటం?'

'నన్నంటారేవండీ—బుద్ధిగా వుండక!'

'ఛీ! నోర్ముయ్!'

'ఎందుకట్లా కస్సుమని లేస్తారు? ముందే కాస్త తెలివిగా వుంటే.'

'యేమిటా వాగుడు? కొంప పగుల్తుంది.'

''సంతోషించాంలెండి.''

''ఆడదానివిగదా—కొట్టడానికి జంకుతానునుకుంటున్నావేమో!''

''ఆలోచించకుండా, మీరీగంతులూ పెడబొబ్బలూ యేవిటి? నాకు తెలీకడుగుతా—''

"నాకసలు వొళ్ళు మండుకుపోతోంది"

"ఇప్పుడేదో చూడండి. ఆనక నన్నని లాభంలేదు."

"తలెత్తుకోలేక పోతోందే—నా యీడు వాళ్ళకింకా పెళ్ళిళ్ళే కాలేదు."

"ఈ శని విరగడైతే మళ్ళీ పెళ్ళాడుదామనుకుంటున్నావు కాబోలు కులుకుతూ."

"ఐందిగా ధ్వంసం. నీ మూలకంగానూ, పిల్లల మూలకంగానూ."

"వచ్చిందిగా, ఈసారీతో మీ కోరిక తీరుతుంది. ఎటొచ్చీ పిల్లలే దిక్కుమాలిన వాళ్ళవుతారు."

"ఏం పెళ్ళిళ్ళు? వెధవ పెళ్ళిళ్ళు? బొడ్డూడకుండా ముడేసెయ్యటం. ఆనక కాస్త మంచీ చెడ్డా, పీటూసాలూ, చూసుగుందుకు లేకుండా ఆడది క్కూంటూ కూర్చోవటం."

"తప్పంతా ఆడవాళ్ళదైనట్లు మాట్లాడుతారేం?

"సంఘమేం, మన సంఘం యిట్లా తగలడిపోతోంది."

* * *

"పద! పద! ఝాము సేపాయి మొత్తుకుంటూంటే యింట్లోంచి కదిలిరావు?"

"వొస్తున్నా—యీ పిల్లలకి కాస్త మూతులూ ముక్కూలూ తుడిచి, రెండు గుడ్డముక్కలు కట్టి."

"నువ్వింకా అవతారం మార్చలేదేం?"

"వీళ్ళకయితే—నే నెంతసేపూ?"

"తెముల్చు త్వరగా-ఆసుపత్రి కట్టేశాక మనం వెళ్ళి యేం ప్రయోజనం?"

"ఆ ఫ్లాస్కూ సంచీ కాస్త పట్టుకోండి. తినడానికి పిల్లలకేదన్నా లేకపోతే ఆనక ప్రాణాలు పీకి పందెట్టేస్తారు?"

"తాళాలు తాళం చెవులూ ఎక్కడ? చెప్పులు! చెప్పులు వేసుగు న్నార్రా అంతా—"

"మీరు కాస్త వో మాటు వీధిలోకి నడవండి— రెండు నిమి షాల్లో వస్తాను."

"సరి-సరి! రండర్రా! రండి బయట రోడ్డుమీద నుంచుందాం అమ్మ వస్తుంది....ఎక్కడికర్రా....ఆ పరుగులు? వారే సరోజ, సీనూ.— చెల్లాయిని పట్టుకోండర్రా....వీళ్ళమ్మ కడుపుమాడ. ఏం వెధవ పిల్లలు? ఒక్కచోట నుంచోరేం? అరెరె!!! పడిపోయావ్! లే....ఛీ! వెధవా — లాగులో పోసుకుంటావ్? ఒసేవ్! ఏమేవ్! ఈ వెధవ లాగు ఖరాబు చేసుగున్నాడు. అబ్బే! ఏడవకమ్మా —ఛా! ఛా! నువ్వుగానవ్మా. ఎత్తు కోనా? ఛీ! ఛీ! నాగుడ్డలుకూడా మాసిపోవూ? అప్పచ్చా! నా శ్రాద్ధం- అదేమిట్రా వో కాల్తోకాలికి లాయిక్కున్నావ్? విప్పు....మంచి సీన్నా! లోపలికి పోయ్ యేడు;....చానా ముర్రీవాలా....యీ వెధవలు పిల్ల లున్న చోటే తిరుగుతారు!....

అరెరె!!! బట్టలు మాసిపోతాయిరా —క్రిందపడి దొర్లుతావేం?.... లమ్డీకొడకా....నోరుమూస్తావా లేదా! హూం! ముయ్‌నోరు! ముయ్! దుంప తెగ! ప్రాణం తీసేస్తున్నారు....ఈ పీనుగ తెమిలిరాదే? బాబోయ్ వీళ్ళు పిల్లలుగాదు రాక్షసులు! ఇహ రోడ్డుపొడుగూతా యేం విసిగిస్తారో.... నుంచోరేం ఒక్కచోట?"

"అమ్మయ్య! ఎందుకండీ పిల్లల్నట్లా యేడిపిస్తున్నారు? మాఅమ్మ రావే....నాన్నకొట్టారా! నేవచ్చిపోసూ....లాగులో పోసుగున్నావా?.... పోసుగోర్లండీ పిల్లలు....ఆ చిన్నవాడ్ని యెత్తుకోమంటే మిడి గుడ్లేసు కుని ఎందుకల్లా చూస్తారు? లాగు విప్పెయ్యమ్మా....పోన్లెండి-పసివెధవ లాగులేకుండా వస్తేయేం? వొంటిమీద గుడ్డెకక్కుండా తిరగచ్చుగాని ఈ వూళ్ళో ఆడాళ్ళు! పసి వెధవకు వచ్చింది నామోషీ! ఆ మరమరాల వాడ్నిట్లా పిలవండి. చిల్లరుందా....ఈ చెప్పులు కరుస్తున్నాయండీ ఎట్లాగో నడవటం....అబ్బ రిక్షాల్లేవండీ వెధవవూళ్ళో....మీరు వెయ్య

చెప్పండి, లక్ష చెప్పండి—ఆ బస్సుల్లో నేను రాను. పిల్లలు నలిగిపోరూ? నాలుగు రూపాయలవుతే అవుతుంది రానూ పోనూ షట్ షట్ పిలవండి. ఏంచేస్తాం యింట్లోంచి కాలు కదిపితే కష్టవుతోంది."

* * *

"లేడీ డాక్టరుకి చీటీ పుచ్చుగో—ఇదుగో ఆడవాళ్ళ కిటికీ."

"నాకు తెల్సు లెస్తురూ—పిల్లల్ని పట్టుగోండి కసురుకోక."

"నువ్వు వెళ్ళి అన్నీ కచ్చితంగా అడుగు నాన్చక. మరేం ఫరవా లేదు అడిగినవన్నీ చెప్పు! శ్రీ గవర్నమెంటువారి దయ."

"నాకు యింగ్లీషు రాదుకదండీ!"

"హిందీలో చెప్పు—వుండు యీ చీటీ చూపించు పోనీ—వాళ్ళే చెప్తారు అన్నీ."

"అందులో మీరేఁ రాశారో, అసహ్యం...."

"అబ్బే! యేవీలేదు—ఫలానా....ఫలానా"

"మళ్ళీ ఎక్కడికీ వెళ్ళిపోకండి. నాకేవిటో గుండె దడగా వుందండీ?"

"భయం లేదులేవే-ఆడవాళ్ళ వ్యవహారం మరి. చల్లకొచ్చి ముంత దాచడమెందుకు?"

"మీరు కూడా వస్తే....!"

"ఛంపావ్! లేడీ డాక్టరు గెటవుట్ అంటుంది, వెళ్ళు! వెళ్ళు! మళ్ళీ పిల్లలు వెంబడిస్తారు.

* * *

"ఏమే! వచ్చేశావేఁ"

"మిమ్మల్నికూడా రమ్మంటోంది."

"నేనెందుకే—మరి పిల్లలు?"

"ఏవో ప్రశ్నలడగాలిట ! పిల్లల్నికూడా తీసుకు రమ్మంది."

"రామ ! రామ ! ఎట్లాంటి కఠిన పరీక్ష తెచ్చిపెట్టావురా తండ్రీ ! పద——పద !"

"నేను సరిగా చెప్పటంలేదుట-అందుకని."

"నాకు తెలుసు, నాకు తెలుసు! నేననుకుంటూనే వున్నాను. నువ్వెందుకూ పనికిరావని."

* * *

"నమస్తే!"

"నమస్తే!"

"బైఠియే :"

"థాంక్స్ !"

"పేరు ?"

"కుటుంబరావు; ఇంట్లో అబ్బులంటారు."

"ఆవిడ పేరు ?"

"సరస్వతమ్మ! అమ్మడు ముద్దుపేరు."

"అవన్నీ ఎందుకండీ చాదస్తంగా——"

"నువ్వూరుకో....పిల్లాడు డాక్టరు బల్లక్రింద దూరుతున్నాడు—లాగెయ్ !"

"వయస్సులు?"

"నాది ౨౭. ఈవిడ....పాతిక...."

"ఛ....ఛ....ఎందుకండీ ఎక్కువ చెబుతారు?"

"యస్! యస్! ట్వంటీటూ...."

"మీకాస్టే తేడా లేదే? పెళ్ళయి ఎన్నేళ్ళయింది?"

"పదకొండేళ్ళు."

"సోయర్లీ .... అప్పుడామె వయస్సు పదకొండా?"

"ఎగ్జాక్ట్లీ...."

"చాలా అన్యాయం. మీరు కాపురం ఎన్నాళ్ళబట్టీ చేస్తున్నారు?"

"దస్సాల్ సే..నో నో—8 ఏళ్ళనుంచీ—" (ఏవిటీ యక్షప్రశ్నలు?)

"మీకు ప్రస్తుతం ఎంతమంది పిల్లలు?"

"రాసుగోండి—వెంకట సత్య సూర్య సుబ్రహ్మణ్య శివరామేశ్వర రావు."

"నో-న్నో-సెక్సు చెప్పండి. వయస్సులో,"

"కొడుకులు 7 1/2, 5 1/2, 4 1/2 3 1/2....కూతురు 1 1/2."

"క్షమించాలి 7 1/2కి 5 1/2కి, 3 1/2కి 1 1/2కి మధ్య రెండేసేళ్ళు ఎడం ఎందు కొచ్చిందో చెప్తారా?"

"ఒక కడుపుపోయింది. ఒక పిల్లవాడు పుట్టి పోయాడు."

"మిష్టర్....హారిబుల్....చూడు ఎంత నీరసంగా వుందో? ఎనిమిదేళ్ళలో యేడు కానుపులా? బుద్ధదేవుని భూమిలో పుట్టినావు....స్త్రీల యెడ కాస్త కరుణ చూపించు."

"ఏంచేసేది? అందుకేగా వస్త—"

"జనాభా పెరిగిపోతే చాలా కష్టం! ఏం ఉద్యోగం?"

"యూ. డీ. సీ."

"ఎక్కడ—జీతం?"

"ఎడ్యుకేషన్ మినిస్ట్రీ—నూట ఎనభై!"

"సోస్మాల్! ఏం చదువుకున్నారు?"

"యమ్మే (హిస్టరీ)."

"షీ-"

"చదువుకోలేదు. హార్మణీ వాయిస్తుంది."

"సారీ? చూడండీ, ఈ అట్టపెట్టెలోంచి తీస్తున్నాను, చూడండి. అట్లా తలకాయ వంచుకోవద్దు. సిగ్గుపడొద్దు. అబ్బే....ఫరవాలేదు. సృష్టి కార్యం యీ విధంగా...."

"ఛీ! ఛీ! ఛీ! రామ! రామ! ఏవిటండీ యీ బూతు భాగోతం — నేను లేచిపోతాను. ఈ అడపీనుగులకి సిగ్గులేదేమంట — మొగాళ్ళకి చెప్ప టానికి. నాకు డోకొస్తోంది."

"బై ....బై రో.... మేక్ హర్ సిట్ ....ప్లీజ్! ప్లీజ్!"

"వొద్దండీ! ఇవ్వేం వద్దు ఏవన్నా మందు యివ్వండీ — గుటు క్కున మ్రింగితే చటుక్కున పనిచేసేది. ఈ పుడకలూ గొట్టాలూ పిల్లలు యీడ్చుకుపోయి వీధుల్లో ఆడుకుంటారు — మ్రింగేందుకు ఏవన్నా యిస్తా రేమోనని.... "

" నో ....నో ....గవర్నమెంటువారు చవగ్గా కొనుక్కుంచుకు యిస్తారు....మీ యింటి నెంబరు? మేం యింటికొచ్చి తెలియచెప్తాం...."

"మొహం బోర్లేసి యీడుస్తారు కొంపకొస్తే."

"నువ్వూరుకోవే — ఏంలాభంలేదండీ. శలవు, వస్తాం!"

* * *

"ఏమిటా యేడుపు అసహ్యంగా,"

"మనకి పిల్లలు బరువైపోయారా? మనం భూమికి బరువై పోయామా?"

"నిన్నూ నీ పిల్లల్నీ యెవరేమన్నారు? వూరుకో...."

"కావాలంటే వస్తారా? అక్కరలేదంటే మానారా? పుట్టిన పిల్ల లందరూ చక్కతారా? నా పిల్లల్ని పొట్టచించుకొని కడుపులో దాచు కుంటాను. అన్నం లేకపోతే ముష్టెత్తుకొని గంజిపోసి పెంచుకుంటాను."

"అంతేలే — వూరుకో!"

"పిల్లల్లేనివాళ్ళు అదృష్టవంతులా? తల్లి కావటం అవమానమా? పిల్లల్ని కనొద్దని చెప్పేవాళ్ళు యీహాంబులూ, విమానాలు, చంద్రుళ్ళనీ వాటినీ చేసి ఆకాశంలోకి ఎగరేయటం మానరేం? పుట్టికెగరలేనమ్మ స్వర్గానికి ఎగురుతుందా?"

"అట్లతద్దినోము అమెరికావాళ్ళకూ రష్యావాళ్ళకూ తెలీదే ?"

"మన సుఖాలకు, వడానికే, సినీమాలకు డాన్సులకు పరిగెట్టడానికి డబ్బు చాలదని పిల్లల్ని కనొద్దంటారూ ?"

"సరేలే....ఎరగ్గాపోయి తీసుకెళ్ళాను నిన్నాఆసుపత్రికి. లెంప లేసుగుంటాను....పోయి కాఫీపెట్టువెంటనే,"

"ఆ ఫ్లాస్కులోనే వుండండీ—పిల్లలకి పట్టండి. మీరు త్రాగండి."

"నీకో"

"నాకు కాళ్ళు లాగుతున్నాయ్, తలనొప్పిగా వుంది."

"మరైతే నువ్వే లాగు. అమృతాంజనం రాయనా ?"

"చాల్లెండి. ఆ పిల్లల్నసింటా తీయండి. ఆ చంటిదానికి లాగూ గౌనూ తీసి క్రింద వొదిలెయ్యండి, మీరేమో ఆ పులివేషం తీసి పంచె గట్టుకుని కుంపటి వెలిగించి—కాదు కాదు ముందు అ చాపిట్లా పారెయ్యండి,"

"ఓస్సినీ !!! కొంపముంచావే !"

# "జవానీకీ రైలు"

"ఆలాటిలాటాడదాన్ని
కాను మేస్త్రిరీ!
అర్ధ రూపాయి డబ్బులకు
రాను మేస్త్రిరీ!
నే రాను మేస్త్రిరీ!"

అన్న పాట గొట్టాం గ్రామఫోనులోంచి హోటల్లోని అలగా జనం గుండెల్లోకి ప్రవహిస్తూండగా, తడబడ్తూన్న కాళ్ళతో కత్తిలా దూసుకుని బైటకొచ్చింది మంగ.

గాలి వెర్రిగావీస్తోంది.

వర్షం వుధృతంగా కురుస్తోంది.

నీళ్ళలో పడి పడిగా నడుస్తున్న పాదాలు, పావడా కుచ్చెళ్ళు యెత్తి పట్టుకున్న బిగువైన పిడికిలిలో నిర్దేశం కాని పట్టుదల, చలికి పెదిమలను కొరుక్కుంటూన్నప్పుడు కోపంతో ఎగురవేసినట్లున్న నాసాపుటాలు, కొడ్తున్న వాన జల్లుకు ముఖం తడిసిపోయి చెరువై ముంగురులు నుదురు నతుక్కునిపోగా.

—వడివడిగా నడుచుకునిపోతున్న పదహారు పద్దెనిమిదేళ్ల వొంటరి తుంటరి పడుచు పిల్ల ఏమాలోచిస్తున్నది?

ఎందుకంత అలక్ష్యంగా ఆవేశంగా పోతున్నది?

ఏం చేస్తుంది?

చూసేవాళ్ళకి ఆ అమ్మాయికోసవతితల్లి వుండవచ్చుననిపిస్తుంది. ఆమె బహూ కర్కోటకురాలు. పాపిష్టికావరె—'మంగ' మినహాయించి మిగతా పిల్లలంతా కురూపులు. యీసురోమంటూ వుండి వుంటారు, చక్కగా వాళ్ళంతా మంచి మంచి పట్టురవసెల్లాలు, చీని చీనాంబ

రాలు, ధవళ దుకూలాలు ధరించి తిరుగాడుతూ పాడుతూ వుంటే, నవ నవలాడే లేతప్రాయం పిల్ల అడ్డమైన చాకిరీచేస్తూ, నానా కష్టాలూ పడుతూ, మంచిగావుంటూ కడవలకొద్దీ కన్నీరు కారుస్తూ దుఃఖసంగా జీవిస్తూ వుండాలె : ఈ అన్యాయానికి, కీలుబొమ్మలాటి తండ్రే కారణం కావచ్చు !

పోతే మరోలా ఆలోచించేవాళ్లకు పాపం యీ అమ్మాయి అమా యకంగా యే పొరుగింటి పడుచు కుర్రాడినో వలచికాని, వలపింపబడి కాని కొంత గ్రంథం అటూ యిటూ జరిగాక-ఆ చాతగాని ప్రియుడు, చల్లగా రైల్లో ఎటో చెప్పకుండా చెయ్యకుండా వుడాయిస్తున్న వుదంతం పసిబట్టి కసిదీరా నాలుగు ముక్కలూ చెడా-మడా దులిపేసేందుకు వానా వరద లక్ష్యం చెయ్యకుండాపోతున్న కథానాయకి అయినా కావచ్చు !

మరో ముక్కద్దాల దృక్కోణంలోంచి చూస్తే దీపాలు పెట్టే వేళ, చీకటి యిరుకుసందుల తప్పుల్లోకి,

> "కొంగు తగిలినాచాలు నా కదియు
> కొంత భాగ్యమే చెలియా!
> ఈ చింత దక్క వేరేమి లేదు
> నా మాట నమ్మవే చెలియా!

నా మాట నమ్మవే చెలియా?" అంటూ రెక్కపుచ్చుగు టక్కున లాగి, చెక్కులు ముద్దాడి, పరపరలాడే కొత్త చూపాయి నోట్లను గుప్పిట్లో తురిమి, ఛంగుమనీ రిక్షాలో కురికి, "వికవికలూ-పక పకల్తో" ఏ సినీమా హాల్లోనో జంట జంటగా తూలిపోతూ, కిల్లీలు ఎర్రగా నమిలిన పెదవులతో, నాలిక మడత వేసుకుని చూసుగుంటూ, ముసి ముసిగా నవ్వుకుని, చవగ్గా తేలిగ్గా కాలక్షేపానికి పనికొచ్చే "పడుచు దనపు రైలుబండి" అయినా కావచ్చు!

* * *

వయసులోనే ముసలితనం వచ్చినట్లు సాయంత్రం యింకా వుండ గానే చీకటి పడిపోతోంది. బరువుగా తలలూపుతున్న చెట్లు, కప్పలు కీచు

రాళ్ళు చుట్టాలకుమల్లే ఒకటే గోల—యిదంతా 'మంగ'కు నానా చిరాకు గాను, కోపంగానూ వుంది. ఆమె వూళ్ళో ఎక్కడా ఆగలేదు. కాని ఆమె జనసంహారాన్ని, ప్రక్క ప్రక్కలా ముందూ వెనుకా చూసుకుంటూ, కనిపెట్టి నడుస్తోంది. ఏ బస్సన్నా, బండి అన్నా దారికడ్డువచ్చినప్పుడు అసహనంగా నిలబడిపోతూ అక్కడా అక్కడా బండి కావాలా అని అడిగే రిక్షావాళ్ళకు వొద్దని కర్కశంగా చెబుతూ మన్మథుడిబాణంలా దూసుకొని పోతున్నది.

కట్టుకున్న బట్టలన్నీ తడిసి ముద్దయినాయి. చలి గజగజలాడించేస్తోంది. రైల్వే స్టేషనులోని స్త్రీల మధ్యతరగతి విరామశాలలోకివచ్చి స్నానాలగదిలో దూరి బట్టలన్నీ పూర్తిగా వొలిచేసుగుని త్వరత్వరగా పిండుకునిఆరబెట్టుకోసాగింది మంగ. సౌష్టవమైన ఆ అమ్మాయి శరీరపు వొంపులు, వెన్నున అలక్ష్యంగా విసరివేయబడ్డ వాలుజడ, నున్నని బుజాలు, ఎత్తయిన పిరుదులు, కొద్దిగా వొణుకుతున్న మోకాళ్ళు అద్దంలో మనోహరంగా అగపడ్తున్నాయి. అప్పటికి కొద్దిగా ఆరిన బరువైన పరికిణీని కట్టుకుని, తడియారని వల్లెవాటును బిగువైన యెదురు రొమ్ము భాగాలకు అచ్ఛాదనగా వొత్తుగుంటూ హాలులో మధ్యగావున్న గుండ్రటి బల్లమీద పైన గిరగిరా తిరుగుతూన్న పంకాకు జుత్తును ఆరబెట్టుకుంటూ, ధగధగా మెరిసిపోతున్న మెర్క్యూరీ దీపకాంతిలో, పయ్యారంగా కూర్చొని, బైట వచ్చిపోయే జనాన్ని, రైళ్ళను పరిశీలనగా చూస్తూ. లజ్జాసంకుచితమైన చిరునవ్వుతో, వోరచూపుల్ని విసరుతూ దిగి వచ్చిన దేవకన్యలా కూర్చొనుంది, మన్మథుడి బావుటా మంగ.

ఎవరెవరో తొంగి తొంగి చూసి వెకిలిగా యికిలిస్తూ పోతున్నారు. బుష్‌కోటు కాలర్లు సర్దుకుంటూ, పెదవులకు సిగరెట్లను చేర్చి ఆ అగ్గిపుల్ల గీసి గుమ్మంలోకి ప్రేమబాణంలావిసర్తూ, పంట్లాము జేబుల్లోకి చేతుల్ని పోనిచ్చి కీవి వొలకబోస్తూ తిరిగే రకరకాల ప్లాటుఫారంమీది కుర్రవాళ్ళు, చేతిరుమాళ్ళతో ముఖాలు రుద్దుకుంటూ, బొళ్ళను టకటక లాడిస్తూ నేలచూపుల్ని ప్రసరిస్తూన్న మనుష్యులు అనేకులు క్రమంగా అక్కడకు చేరుకోసాగారు. ప్రేమకూడా పల్లానికే ప్రవహించేట్లుంది:

మంగ బల్లమీంచి దిగివచ్చి, గుమ్మంతలుపు రెక్కను చేత్తో ఆన్చి, గాలికి రెపరెపలాడి ఎగురుతున్న పావడా కుచ్చెళ్ళను, వల్లెవాటును రెండవ చేత్తో అణచుకుంటూ, పెదవులమీద దోబూచులాడే చిరునవ్వును కప్పుగుంటూ—

'వాన యింకా కురుస్తున్నట్లుందే.' అని ముఖాన్ని అదోలా విసుగ్గా పెట్టి, వరండాలో నిలబడి మొదటి తరగతి ప్రయాణీకుల హాలుపద్ద మడతలు నలగని సమ్మరు సూటులో ఆలోచిస్తూ నిలబడ్డ అవతారానికి వినిపించేలా—

'డీలక్సు యింకా ఎంత ఆలస్యంగా వస్తుందో-' అని అదోలా త్రిప్పి, బెదురుతూ స్తంభానికి చేరువగా వచ్చి నిలబడి గలగలా చేతి గాజుల్ని విదల్చి సర్దుకుంటూ చిరునవ్వుల్ని అతగాడిమీదకు రువ్వటం ఆరంభించింది. ఆ ఆసామీ వదుల్తున్న మగవాసనకు పొగవాసనకు వయ్యారంగా చేతుల్ని అర్ధచంద్రాకృతిలో అడ్డటాన్ని నోరూరుతూ పరికిస్తూన్న వ్యవధిలో, వేరే మరో దుశ్శాసనుడు, బుగ్గమీసాలూ, సిల్కులాల్చీ, రవుడీలా పెంచిన గిరజాలజుత్తూ, గ్లాస్గో లాల్చీ, కట్ బనీనూ వాడూ, మహాపని వున్నవాడిలా అర్జంటుగావస్తూ చూడనట్లు 'మంగను' ఢీకొనడం-ఆ విభీతహరిణాక్షి 'అమ్మో!' అంటూ ఛెంగుమని దూకి ఆసూటువాలాను వాటేసుకోవటం, అంత ఖరీదైన అదృష్టానికి-పడుచుదనపు రైలుబండివచ్చి మీద పడ్డందుకు వుబ్బి—తబ్బిబ్బై గుడ్లెర్రచేసి—

'కళ్లు కనబడ్డంలేదా- ఆ అమ్మాయి నట్లాతోసుకుసదుస్తావే? కబడ్దార్! రాస్కేల్....డొ్ంకచీ రేస్తా....ఎ....ఎ....ఏమనుకుంటున్నావో?' అనివాడిమీదకురకపోగా మంగ రెండు చేతుల్తో ఆ ఆసామీ కోటుపట్టుగుని 'వ....వ....వద్దండీ? మీ రెందుకు పాపం....నా మూలంగా' అంటూండగానే ఆ దుశ్శాసనుడు 'ఏవిట్రా పేలావ్?' అని యీసూటువాలా కోటుకాలరు పట్టుగుని గుంజుతూంటగా మంగ 'క్షమించండి? వద్దండి!' అంటూ వాళ్లిద్దరికి మధ్యలో దూరటంలో—దుశ్శాసనుడిమీద పడవలసిన దెబ్బ

మంగకు తగిలీ తగల్టం యింకా చుట్టుప్రక్కల పదిమందీ చేరకుండగానే మీసాల పురుషుడు—

'గొప్ప మొనగాడివే! ఎల్లవయ్యా....కొట్టు! ఆడపిల్లను కొట్టు! అంతకన్నా నీకు చేతకాదుగా! ఛీ! సిగ్గుండాలి మొహానికి' అంటూ ఎటో వుడాయించడం అంతా క్షణకాలంలో కన్నుమూసి తెరచేలోగా జరిగి పోయింది.

మంగ యేడువ సాగింది (కాంభోజీ రాగ విపంచికారవ సుధా పూరంబు తోరంబుగాన్) ఆ సూటువాలా యింకా ప్రోగైన పెద్ద మనుష్యులు—

"ఏవిటమ్మా. ఏవిటండీ సంగతి?" అంటూండగానే మంగకు కళ్ళు తుడుచుకుందుకు "పారిస్‌లో సాయంకాలపు" సెంటు పూసిన చేడుమా ల్నిస్తూ— జబ్బమీద చెయ్యేసి "డోంట్‌వర్రీ ప్లాటుఫారంమీద రవుడీ వెధవలు బరి తెగించిపోతున్నారు. పద-ఐస్‌క్రీం తినిపిస్తాను" అని హైక్లాసు దేవేంద్రభవనంలాటి రైల్వే వుపాహారశాలలోకి, వంగివంగి సలాములు చేసే తెల్లదుస్తుల బాస కడుపు బేరర్లను దాటించి అద్దాలు పంకాలు మెత్తల మధ్య పరదాలాగి ఏకాంతాన్ని ఋజువు చేసుకున్నాక గుండెను గొంతుకలో పొంగించి—

"మైడియ్యర్! నిన్ననవసరంగా కొట్టాను. మధ్యన ఆ వెధవ కాస్తా వుడాయించేశాడు, చెప్పు నాతో వస్తే....డీలక్సులో మనిద్దరం ప్రయాణం చేద్దాం. నీకు కో అంటే కోటిచీరలు, నగలు, కార్లమీద షికార్లు....నాతో వుండిపో....మంచి అమ్మాయివి కదూ? ఏదీ వూఁ అను. హా? రైటు. యిప్పుడు యీ పూర్టు జెల్లీ తిను-ఫరవాలేదు మనిద్దరి మధ్యా ఎంగిలేమిటి? పటీక్ రైట్. నేను చెప్పినట్లల్లావింటివట్టయినా నిన్ను పెద్ద స్టారును చేస్తాను, లక్ష లార్జిస్తాము. నీకోసం ప్రజలు ఒకరొక్కరు పొడుచుకుని చస్తారు."

"నిజమేనా? ఏవిటో యేదుస్తూన్న దాన్ని నవ్విస్తారు."

"నన్ను నమ్మలేకపోతున్నావా-నా శైలా" అని కోటుజేబులోకి చేతుల్ని పోనిచ్చి, తేలు కుట్టినవాడిలా చేతిని వెనక్కి లాగేసుకుంటూ.

"బ్రా...బాప్....అరెరె??? నాపర్సు పోయింది. వాడే ...వాడే ....డట్ స్కౌండ్రల్....ఆ సిల్కు లాల్చీ....బుగ్గమీసాలూ-,' కుర్చీ లోంచి లేచిపోయి ఖంగారుగా బైటకు పోబోతూండగా మంగ—

"అయ్యో? అయ్యో! వెళ్ళిపోతున్నారే....నన్ను సినిమా స్టారును చేస్తానన్నారే...." యీ మాటల్ని వినిపించుకోకుండానే—

"అంతా నీమూలంగానే....నాపర్సు....నాపర్సు...."అంటూ చెవి గోసిన మేకలా గోలపెట్టుకుంటూ ప్లాటుఫారంవైపు పరుగెత్తుకు పోయాడు పురుషుడు.

"ఏమి మగవాళ్ళు?"అనుకుంటో ప్లాటుఫారం రెండో వైపునుంచి బ్రిడ్జిమీదకు విసవిసా నడచి వెళ్ళిపోయింది మంగ.

* * *

వాన వెలిసింది. దీపాలుపెట్టి వూళ్ళో చాలాసేపయింది, జనం మాత్రం ఎవరి పనులమీద వాళ్ళు తిరుగుతున్నారు. చీకటి బరువుగా సందుల్లోనూ యిళ్ళ కప్పులమీదనూ, మురికి కొంపలు,గుడిసెలమధ్యనూ, స్థావరం యేర్పరుచుగుంటోంది. మంగ పాము మెలికల్లాటి వీధులన్నీ దాటి సందులో పాతబడ్డ పెంకుటింటిముందుకు వచ్చి నిలబడి కాస్త తట పటాయించింది. లోపల దీపం వెలగటంలేదు. అడుగులనిండా తడి. దుమ్ము. కిటికీలకు తలుపులూ ఛూచలూ వున్నట్లులేదు. ఒక్కక్షణం చూసి విస్సురుగా లోపలకుపరుగెట్టింది. అక్కడ గోడలన్నీ వొరిగిపడి పోయి వున్నాయి, దొడ్డి అంతా నానా జీబూతంగానూ వుంది. వానలో తడిసింది, కప్పలూ కీచురాళ్ళగోల....కన్ను పొడుచుగున్నా యేమీ కానరావటంలేదు. చిరపరిచితలా మంగ నిట్రాళ్ళపాకవద్ద నిలబడి "మావా —వోమావా" అనీ సన్నగా కేకేసింది. జవాబు రాలేదు. వంగి తలుపును దబదబా గుంజింది. కిర్రుమని ధ్వని చేసుగుంటూ తలుపు త్రోవ

చేసుగుంది. ఎక్కడా దీపంలేదు. లోపలకుదూరి చీకట్లో అస్పష్టంగా పడి వున్న సిల్కులాల్చీ, గ్లాస్గోమల్లు పంచె, ఖరీదైన జోళ్లు చిందర వందరగా నులకమంచంమీద విసరి వేయబడి వుండటాన్ని పోల్చుకోగలిగింది, వంగుని లాల్చీ పంచెను చేత్తో పైకిలాగి తడుముళ్ళాడుతూంటగా పొట్ట విచ్చుకొని పడివున్న ఖాళీ పర్సు మంగచేతికి తగిలింది, పెదవి కొరుక్కుంటూ ఆలోచిస్తూ కుక్కి మంచంలో అలానే కూలబడిపోయింది మంగ. ఆమెలో జీవశక్తియొక్క చలనం స్తంభించిపోయినట్లుంది, సెలయేరులా పొంగి వచ్చింది దుఃఖం. కళ్లు గట్టిగా మూసుగుని చేతుల్లో ముఖమంతా కప్పుకుంది. కాని ఆమె మనస్సులో ఘోరంగా పైశాచిక నృత్యం చేస్తున్న సంఘటనలు బాహాటంగా విచ్చుగుని బొమ్మల్లా భయంకరంగా కదలాడ సాగాయి,

వొకటి-—

పగబట్టినట్లు కుండపోతగా, వుధృతంగా కురిసే వానలో కొంపంతా తడిసిపోతూంటే, దుర్భర దారిద్ర్యంలో, ఆకలిలో, రోగంలో చూసే దిక్కులేక, మందూ మాకూ యిచ్చేందుకు చేతిలో ఎప్రకానీ లేకుండా, నులకమంచంలో కక్కుల్తో ఫెళ్లున కాస్తున్న జ్వరంలో పెట్టిగాలి వుండి వుండి వీస్తూంటే, పోలికేకలుబెడ్తూ మృత్యువుతో పెనగులాడ్తున్న కన్న తండ్రిని చూస్తూచూస్తూ వూరుకోలేక-ప్రేగుకదిలి బంపపుకోత పెట్టినట్లు కాగా.

రెండు,

దొంగమావ రంగయ్యను కదలిస్తే-"నా వెంటరావే పిల్లా-బ్రతుకు తెరువు చూపెడ్తా" అని మంగకు చెవికొరికి "సయ్" మనిపించి అటు గంపెడు దుఃఖాన్ని కడుపులో త్రొక్కి పెట్టుకుని—

"వోరచూపులు, వయ్యారాలు, చిరునవ్వులు, విలాసాలు. హాస్యాలు-—"నటిస్తూ పబ్లికు ప్లాటుఫారంలో కళ్ళల్లో దుమ్ముకొట్టి బరువైన పర్సుతో చల్లగా చడీచప్పుడూ గాకుండా బైటపడాలంటే — గుండా—చెరువా?

* * *

మంగ వులిక్కిపడి లేచేసరికి రంగయ్య కొరకంచులా ఎదట నిలబడి వున్నాడు.

"దయ్యమా; యిక్కడున్నావేం?"

'...............'

"ఊరంతా సెడగాలించేశానే! పోలీసోళ్ళ చేతుల్లో కెల్లిపోయినా వేమోనని గుండె బేజారెత్తిపోనాది."

"నువ్వా మావా:-నన్ను మా అయ్యకాడికి తీసుగెల్లు. సూడాల" ఆతృతగా లేచింది. కల్లు వాసన దిమ్మతిరిగేట్లున్నది.

"పులిమీదున్నావు మావా?" రంగయ్య పగలబడి నవ్వుతూ,

"వైద్దుగుడికి కబుర్టి గెల్లాడు."

మంగ కోపంగా రంగయ్య చొక్కాపట్టుగుని గుంజుతూ.—

"ఎవరు చెప్పు? చెప్పవేం?" అని గద్దించింది.

"ఆడే యమధర్మరాజు. ఇప్పుడేగా బూడిదచేసి వస్తూంది?" అని రంగయ్య మంగ నెత్తిమీద లాలనగా చరుస్తూండగానే.

"అమ్మో! వోరి నాయనో....నాయనో!!?" అంటూ గుండెల్ని బాదుకుంటూ ఆ కీకారణ్యంలో జుత్తు పీక్కుంటూ పరుగెత్తిపోతూండగా, రంగయ్య చెయ్యి పుచ్చుగుబాగి అమాంతం యెత్తి బుజాన్నేసుకుని 'నంజె కానా! మీ యింటి చాయలకుపోతే నిన్ను పోలీసులు పట్టుగుని లొక్కుపోతారు.''

మంగ రంగయ్యను పీకుతోంది, రక్కుతోంది. రంగయ్య తంద నాలు తొక్కుతూ.

"మంగా—నీ కొంపలో సూరీడూ సెంద్రుడూ సచ్చిత్రాలూ తొంగి సూడ్డం అబద్దమా? మీయయ్య దిక్కుమాలిన సావుసావడం అబద్దమా! ఎవ్వరినీయేగానీ లేకపోవటం అబద్దమా? మనం దోచుకురావటం అబద్దమా? మనం బతకటమే నామర్దా. - నువ్వో గుడిసేటువి—నేనో దొంగ మావని. సరేసరి."

మంగ వెక్కుతూ. "మనం దొంగలమా మావా!"

అతడి భుజంమీద వాలిపోయింది.

"మీ యయ్య పోయాడని దుక్కంగుందా? దొంగవై పోనావని లావుదుక్కంగుందా —చెప్పు నా మంగీ!".

"బతికి మనం దొంగలమై పోనాము మావా—అందుకే చెడ్డ దుక్కంగా వుంది నాకంగా."

"పెదాపే—,మంగా" అని ఆ పిల్లను వాటేసుగుని మొండిగోడ నవలీలగా లంఘించాడు రంగయ్య.

అంతే—

దూరాన్నుంచి పోలీసు యీలలువినిపించసాగాయి! బూట్ల చప్పుళ్లు దగ్గరగా రాసాగాయి!!?



# ముసలమ్మ మరణం

చీకట్లో మొండిగోడవారన మెట్లదగ్గిర అలికిడికి, వస్తున్న వాడ్నల్లా ఆగి-

'ఎవరద్బా! అరుగుమీద....'

'నే....న....(రా' మూలుగుతూ కదుల్తోంది, ఎవరో మూటకట్టి మా అరుగుమీద పారేసిన కుళ్లు గుమ్మడిపండు.

'హో! నువ్వా బామ్మా! ఎట్లా వచ్చావ్?'

ఎప్పుడు వచ్చి కూర్చుందో, ఎట్లా దారి తెలుసుకుని వచ్చిందో!

'ఆ రిష్యావాడు యిక్కడ దింపేశాడురా బాబూ!'

'ఏ రిష్యావాడూ?' ...'ఓహో! రిక్షావాడా? లే బామ్మా! ఇట్లా అరుగుమీద కూర్చున్నావేం? లోపలికి పోదాంపా—'

'లేవలేనురా అబ్బాయి....'

కూచుంటే లేవలేదు. లేస్తే కూచోలేదు. చెంబు, మూటా పుచ్చు
కుని కర్ర చేతికిచ్చి నిల్చోపెట్టాను. గొణుక్కుంటూ నన్ను చూసి.

'నువ్వు మాచెప్ప కొడుకువిగమూ,' అని కళ్ళొత్తుకుంటూ 'అయ్యో
నా రాజా — నా కంటే చిన్నవాళ్ళంతా పోయార్రా! కాని నాకు మాత్రం
ఛావు రాకుండా వుంది."

నాకీ బామ్మ హస్తవాసి ఒకంపసుకు గుర్తు. ఒక మాటు అవిడ వెల
క్కాయ పచ్చడి చేసింది. దానికోసం దేవదానవులు పోట్లాడుకుంటే
ఆశ్చర్య పడ్నక్కర్లేదు. పులిహోరగాని పులుసుగాని చేస్తే దాన్ని అట్టే
బెట్టుకుంటే రోజు రోజుకీ దాని రుచి యింతకు రెంతింతలవుతుంది. పరుస
వేది తగిల్తే అంతా బంగారమయినట్లు యీవిడ చేయి తగిల్తే ఏ పదార్థ
మైనా అమృత తుల్యమవుతుంది. పిల్లలకు యేదన్నా కాస్త నలత కను
పిస్తే ఆవిడ పోపుల పెట్టెను మెడికల్ ఛెస్టుగా వాడేసేది. అడంతా
జ్ఞాపకమొచ్చి.

'బామ్మా నువ్వుచేస్తే వెలక్కాయపచ్చడి తినాలని వుంది.' అన్నా.

'అయ్యో నే చచ్చిపోమా....యింకా వెలక్కాయ పచ్చడి గుర్తుంది
బాబూ! కళ్లు కనపడవు నాయనా! చేతుల్లో శక్తి లేమరా తండ్రీ!
నా వంటెవరిక్కావాలిరా....దిక్కుమాలి వంట....!

ఆ యెముకల పోగుని అభిమానించి యెత్తుకుని మెట్లన్నీ యెక్కి
మేడమీదకు తీసుకెళ్ళాను.

'నువ్వెట్లా వచ్చావ్ పెద్దమ్మా?' అని నిలువు గుడ్లేసుకుని దారి
కడ్డంగావచ్చి నిలబడిపోయింది మా పిన్ని. మా మేనత్త పళ్లు పటపటా
కొరుకుతూ, స్నానాల గదికేసి నన్ను మళ్ళించి 'ఏవమ్మోవ్? పెద్ద
దానివి నీకు మేంచేయవలసిన వాళ్ళమే-కాదన్ను. నీకెక్కడేం సుఖం-
కదలలేవు. ఐనవాళ్ళంతా వుంటూండగా లగుమనమ్మా అంటూ మధ్య
హాసుగుని రావటానికి మేమెవళ్ళం?' అంది

'ఎ...ప...మా..ట్లా,..డే...ది? ఏ-త్తా-లూ-' చేతుల్తో బాత్‌రూం గచ్చుతేమగా వుండటాన్ని గమనిస్తూ 'ఏవేఁ నీ మొగుడిప్పుడు వూళ్ళో గొడవల జోలికి పోకుండా తిన్నగా వుంటున్నాడూ? అబ్బాయ్ : నేల చల్లగావుందేం చెప్మా?' నేను పోయి స్టోరు రూం లోంచి గోనె సంచులు తెచ్చి నేలమీద పర్చి ముసలమ్మను కూర్చో బెట్టాను.

'సడే....నీకెంత సొహంతరంరా?' అని విసిరింది మా మేనత్త. నేనేదో ఘనకార్యం చేశాననుకున్నా. నా వుద్దేశం అంత చలితో చీకట్లో ఆ ముసలమ్మ అపుగుమీద బాధపడ్డం భావ్యంకాదని. పైగా ఆవిడేం పరాయి మనిషా-మా నాన్నకు స్వయానా మేనత్తే.

ఇంట్లోని ఆడవాళ్లంతా నన్ను లోపలికి పిల్చి—

'చావుకి సిద్ధంగావున్న ఆ ముండని మేడమీదకు తీసుగొస్తావ్? ఇంట్లో యెవళ్లనీ అడక్కుండా చెయ్యకుండా—హారే! నీ కిల్లాంటి బుద్ధులు పుడుతున్నాయేఁ?'

'అది చూస్తే తీసుగు తీసుగు ఛస్తోంది. రోగిష్టిదానికి చాకిరీ అంటే మాటలా? ఇంటినిండా పిల్లలు—చిన్న సంసారమా మనది. అంత జ్ఞానం లేకపోతే యెట్లా...'

'మన కొంపలోకి తెచ్చాక దానికి వైద్యం, డాక్టర్లూ—ఛస్తే రేపు బోల్డు కర్చు ఇవన్నీ నీకేం తెలుసు?'

'మనవేంతిన్నాం? మనకేం పెట్టింది? ఎవరు తిన్నారో వాళ్ళే పడతారు అవస్థలు!'

'లేనిపోని తద్దినాన్నెందుకురా యింట్లోకి యీడ్చుకొచ్చావ్?'

'పూరుకోండర్రా!!! పాపం బామ్మకు వినిపిస్తే...' నేను వెర్రి మొహం వేశాను,

'ఏం వినిపిస్తే?'

'నాన్నరానీ—'

బంధుత్వాలు క్షణికమనీ, మనుష్యుల విలవలు వున్నట్లుండి గమ్మత్తుగా తారుమారవులాయని నా కప్పట్లో యేంతెలుసు? ఆవిడ వొంట్లో వోపిక వున్నంతకాలం అడ్డమైన చాకిరీ చేయించుకుని అంతా రొట్టలేస్తూ ఆప్యాయంగా తిన్నవాళ్ళే! మరి అంతా మహమ్మారిని చూసి ఝడుసుకున్నట్టు మాట్లాడ్తారే? నాన్న వచ్చాడు. వస్తూనే కొంపకు అగ్గి ముట్టుకుందని నామీద విరుచుకు పడ్డాడు.

'ఆ వుచ్చలూ పీతిన్నా నేనెత్తిపోస్తాను. మీ కెవ్వరికీ యే శ్రమా వొద్దు.' అని అరిచాను.

'ఐతే చదువూ సంధ్యాలేకుండా ఈ ఆడంగి రేకుపనులన్నీ చేస్తూ కూర్చుంటావన్నమాట?' అంది పిన్ని యెగసనదోస్తూ.

'ఎవర్రా నీ బాబు? ఐనవాళ్లకూ కానివాళ్లకూ ఈ వెట్టి చాకిరీ అంతా చెయ్యడానికి. ఎవడప్పుకున్నాడు ? ఛో ! ముందీ కొంపలోంచి ఆ ముండను బైటకు తీసుగుపోతావా లేక జంధ్యం తెంపుకుని నేనీకొంప లోంచి పైకి పోయేదా?'

నాన్నకు శివమెత్తిపోయింది.

'ఇంత రాత్రప్పుడా —చలిలోనా? ఎక్కడ దిగబెట్టిరాను?'

'ఏట్లో....కృష్ణలంకలో—' అని నాన్న చిందులు త్రొక్కుతూ బాత్‌రూం దగ్గరకెళ్ళి-

'నీ కూతురు అత్తారుండగా మామీదకొచ్చి పడ్డావేమే దయ్యమా? నీ మొగుడి ఆస్తి చుట్టుకున్నారుగా! ఇంకేం వాళ్ళ గుమ్మంలో చావటం న్యాయం! పద! పద!'

'ఇంకెక్కడి కూతురత్తార్రా నాయనా? దాని ఆయుస్సూ మీఆయుస్సూ పోసుగుని నేనెందుకు బతికున్నాన్రా భగవంతుడా? అల్లుడా అని యే మొహం పెట్టుగుని పోన్రా తండ్రీ!' అని గోలు గోలున రాగాలు పెట్ట సాగింది.

'నువ్వేం అనుకోకు పెద్దమ్మా? వాళ్ళకూ మాకూ రాకపోకల్లేవా, నువ్విక్కడ వుండటం యేం బాగుండదు, మళ్ళీ నీ కానక యేంచెయ్యాలి పొచ్చినా యెవళ్ళకు విధాయకమో వాళ్ళ పంచకు పెండరాళే చేరుకో వటం సబబు, తిన్నవాళ్ళుచెయ్యకేంచేస్తారు? లోకం చూస్తూ వూరుకుం టుందా? చెప్పుచ్చు కొక్కడతారు, అనకమేవంతాలేమూ?' అంది పిన్ని సముదాయిస్తూ.

'రిక్షా మెట్లదగ్గర ఆపుచేయించాను' అంది మా మేనత్త రొప్పు కుంటూ మేడమెట్లన్నీ యెక్కివచ్చి.

ఇక చేసేది లేక నేను మా నాన్నా ముసలమ్మను యీడ్చుకుంటూ వీధిలోకి లాక్కువచ్చాం, కర్రా, చెంబూ, మూటా రిక్షాలో సర్దుతూ 'కూర్చో బామ్మా!' అన్నా.

పడమటి దిక్కున కొండంత మేఘం తరుముకొస్తోంది. రివ్వున చలిగాలి వీచింది. రిక్షా కదుల్తూంటే చినుకులు దబదబా పడ్డం ఆరం భించాయి. వజవజా వణికిపోతూ నేను వెనకాతలే సైకిలు త్రొక్కు కుంటూ లాంతరు స్తంభాల్ని లెక్క పెడ్తున్నాను. ముసలమ్మ కుంయ్ కంయ్ మనటంలేదు. నాకు మనసంతా విరిగి గుండె నీరయిపోయింది.

పీడ వదిలించుకున్నామని తృప్తి పడుతున్నారే వీరంతా — యెల్ల కాలమూ రోజులిల్లాగే గడుస్తాయనుకుంటున్నారా?

వీళ్ళకెవరికీ ముసలితనం రాదూ.

ఈ ఆస్తిపాస్తులు గౌరవ మర్యాదలు కలకాలం వుండేవా?

పురుళ్ళకనీ, పుణ్యాలకనీ, కార్యం కరామత్తుల్లో వొంటినిండా చాకిరీచేసి, గుప్పెడు మెతుకుల్తో, వొక సైను పంచె ఒక ఇత్తడి చెంబుతో జీవితాన్ని కృష్ణా రామా అంటూ కాలక్షేపం చేసిన మనిషి, శక్తులుడిగి కాలం ముంచుకొచ్చి మూలపడగానే పాతచెప్పుకన్నా హీనమైపోవాలా?

పనికిరానంత మాత్రాన ముసలమ్మ మనిషి కాకుండా పోయిందా?

ఆ మేడలు రెండూ యింకా ముసలమ్మ పేరనేవుంటే, కుక్కల్లా యెగబడే బంధువులు, చావు బ్రతుకుల్లోవున్న ఆ ప్రాణిని యింత హింస పెట్టాలా, చలిలో, వానలో, చీకట్లో.

గాంధీ నగరంనుంచి బయల్దేరిన రిక్షా బెజవాడ పాత టవును దుర్గ కొండ పీధికి చేరుకొనేసరికి వర్షం యెత్తిపోసింది. రిక్షావాలా తడిశాడు. నేను తడిశాను. ముసలమ్మ సరేసరి—చావలేదు.

అల్లుడిగారింటిముందు రిక్షా ఆపి తలుపులు దబదబా బాదాను.

'ఎవరు వాడు, వస్తూంటే....'అని విసుగ్గా అరుపు. రిక్షాలోంచి దింపుతూంటే ముసలమ్మ 'కూతురా, కూతురా!' అంటూ ఏకగోల! తలుపులు పూర్తిగా తెరవబడకుండానే 'అమ్మగారొచ్చారు' అంటూ నేనూ రిక్షా వాలా కలిసి ముసలమ్మగారిని సునాయాసంగా లోపలికి నెట్టి, పిలుస్తున్నా వెనక్కి తిరక్కుండా ఉడాయించేశాం. తరువాత ఆ వచ్చిపోయిన కూతురి అత్తారు వియ్యపురాలిని ఉచితరీతిని సత్కరించారో, ఆ మెట్లమీదే వానలో రాత్రల్లా వదిలేశారో, ఆ ప్రాణిపట్ల యే అజ్ఞాత హృదయంలోనైనా రవ్వంత సానుభూతి దయకలిగిందో లేదో భగవంతుడికి మాత్రమే తెలుసు. అతడుకూడా యీ విరిగిన చెట్టుని తప్పించుకునే తన రథాన్ని తోలాడు. మృత్యువు రమ్మని పిలవలేదు. చిత్ర గుప్తుడు పాపపుణ్యాల లెక్కలుకట్టి హుకుం జారీచెయ్యటానికికూడా జాప్యం చేస్తూ వచ్చాడు. యముని మహిషపులోహ ఘంటలు విందామని కూర్చున్న ముసలమ్మకు పిలుపు మాత్రం రాకుండావుంది.

చావుని గురించి అదేదో భీభత్సంగా వూహించుకోవడం తప్పించి మనుష్యులు దానికోసం తాపత్రయపడరాదనీ. ఆ ప్రయత్నాలలోవున్న వారిని తప్పించుకు తిరగాలని గ్రహించే పాటి వయస్సుకూడా కాదునాది,

తరువాత నేను కర్ణాకర్ణిగా విన్నది, ఆ మాటీ అల్లుడుకూడా ముసలమ్మను ఆ మర్నాడే రైలుస్టేషనుకు తీసుకెళ్ళి బందరు టిక్కెట్టుకొని యిచ్చి రైల్లో కూర్చోబెట్టి పంపించేశాట్ట! ఒక్కర్తీ ఆవిడ రైలు ఎట్లా

దిగిందో, పుణ్యాత్ములెవరు సాయపడ్డారో వూళ్ళో ధర్మాసుపత్రిలో చేర్పించేశారు. ఇక యీవిడ అధ్యాయం బందర్లో ముగిసేదే తిరిగి రాసను కున్నాం, కాని—ఆశ్చర్యం! అక్కడ పరాయి వూళ్ళో ప్రాణం వదల్టానికి మన గొప్పలేదట. స్వగ్రామం, పవిత్రమైన కృష్ణానదీ తీరం—పోతే ప్రాణాలు యిక్కడ్నే పోవాలిట. మళ్ళీ ఎక్కేగుమ్మం దిగే గుమ్మం—అనవాళ్ళ కొంపలన్నీ చుట్టాక, అందరూ ఛీ! ఛీ! అన్నాక ఆవిడకేమని పించిందో, పాతవూళ్ళో మనుపు పునిస్త్రీగా మొగుడి హయాంలో అర్థణాకాసంత బొట్టూ, వొంటెడు నగలూ మనిషి నిండుగా మెట్టిన సొంత యింటి అరుగు పంచకు చేరింది.

'ఎవరో ముసలమ్మ పాపం అరుగుమీద కూర్చుంది' అనుకున్నారంతా.

'ఎవర్నో కానర్రో—ఇది నా మొగుడి ఆస్తి. ఈ అరుగు నాదే నర్రో!!!' అనుకుంది ముసలమ్మ.

పగలంతా సూర్యుడి ప్రతాపం మూలనున్న ముసలమ్మమీదే—అరుగుమీద పెనంమీది అట్టులా మాడసాగింది. ఇరుగూ పొరుగూ మర్యాదస్తులూ, రోడ్డుమీద ఆడుకునే పిల్లలూ, కూరలవాళ్ళూ, పాలూ పెరుగూ అమ్ముకునేవాళ్ళూ, రాత్రిళ్ళు కుక్కలూ, పందులూ, ఎండకు ఎండ, వానకు వానా, తడిసి చికి చికి పెంటపోగులా మూడు రోజులు కుళ్ళింది. కాని ప్రాణాలు మాత్రం ఆ కాయాన్ని వదిలిపోవటంలేదు.

'అరటి పండు తినాలనుంది పెట్టరూ?' అంటూ దారినిపోయే అర్జంటు పనుల ఆసామీలని అడుక్కునేది. హడావిడిలో చూసీ చూడకుండా కానులు అర్థణాలూ పారేసే పుణ్యాత్ములు, కాస్తదయ గలిగి యిత్తడి చెంబులోకి నీళ్ళు వొంపే ధర్మాత్ములూ....

ఎంత దిక్కుమాలిన చావు రాసిపెట్టుంది యీ ముసలమ్మకనుకున్నారు.

కాని వాళ్ళకేం తెలుసు?

ఈ ముసలమ్మ వొకప్పుడు పట్టు ఫనారసు చీరలు కట్టుకుని, పసుపూ కుంకుమా మెత్తుకుని, కూతుళ్ళూ, అల్లుళ్ళూ, నేనూ నావారూ అంటూ హోషుగా బ్రతికేదని—రక్తమాంసాలు, ఎముకలూ శిథిలమయే దాకా అయిన వాళ్ళకి కాని వాళ్ళకి అడ్డమైన చాకిరీ చేసేదనీ—

ఆ స్త్రీహస్తుల్నీ, వయస్సునీ శాశ్వతమని నమ్ముకునే లోకానికి బరువైన బొమ్మ దీనంగా మృత్యువుని అడిగింది.—

'నీ సుఖం నాకు కాస్త పంచి యివ్వరాదా' అని,

బ్రాహ్మణ వితంతువు కాలంచేస్తే పాడెకట్టి మోసుకుపోయేం దుకు కూడా ఎట్లాటి యేర్పాట్లు జరగలేదు. తెల్లవారుఝామునగా ముసలమ్మగుటుక్కుమంటే మ్యునిసిపాలిటీవారికి కబురుచేస్తే పదకొండు గంటలకి ఎద్దుబండీ, యిద్దరు వెట్టివాళ్ళూ వచ్చి ఆ జీతించిన కొర్కెల గూడుని కృష్ణలంక వైపుకు లాక్కెళ్ళారు.

అరుగుమీద ఫినాయిలుపోసి కడిగారు,

సాయంత్రం చీకటి పడ్డాక పిల్లలు ఆ అరుగువైపు ఆడుకోవటా నికి రావటం మానేశారు.

అన్నట్టు మ్యునిసిపాలిటీ చావు బ్రతుకుల రిజిస్ట్రారువారి వుద్యో గులకి కబురు చెప్పేవాళ్ళు లేరు. ఎవరీముసలమ్మ పాపమని నలుగురూ అడిగితే, శివ శివా ! మాకు తెలీదంటే మాకు తెలీదన్నారంతా !

# ప రి త్య క్త

సాయంత్రం ఆరుగంటల యాభై నిముషాలయింది. వల్లి బద్ధకంగా అవులించి కిటికీలోంచి చూసింది. ఇరవై నైరాశ్యపు చలి గుబుళ్ళ వెనక పన్నెండు శిశిరవసంతాల శైశవం మళ్ళీ యెల్లా వస్తుంది?

రైలు చవిటి పర్రలమీంచి దూసుకు పరిగెడ్తూంది.

వెలిసిపోయిన చొక్కాల్లా మాసినకలలు....ఆపరేషను బల్లమీద సుఖరోగాల చితిమంటల్లో-పాతికేళ్ళ వొక జల్సా కుర్రాడి గుండెలపై అప్పుడు పన్నెండు శిశిరవసంతాల వల్లి యెన్ని పిచ్చికగూళ్ళు కట్టిందో!

ఆకాశంలో వొక్కటే వొకకాకి-ఏకాకి దిక్కుమాలి ప్రయాణం చేస్తోంది. వల్లికి కలలుగనటం చాతకాదు. జీవితపు చీకటి కోనేట్లో తప్ప తాగి తూలిపడ్డ పాంథుడిలా మిస్ వల్లి, యం. ఏ. నిట్టూర్చింది. నిర్జీవంగా బకేటాలా ఖాళీగావుంది పెట్టె. అంతకన్నా చిన్నపెట్టెలో మనుష్యులమధ్య వుండాల్సింది తను. జీవితంలోనూ అంతే-తను కేది కావాలో తెలుసుకోలేని మనుష్యులు సరిగా యెంచుకోపటంలోనే తప్పటడుగులు వేస్తారు. కవరు పేజీమీది బొమ్మలా, యీపెట్టెలో తన్ను యిముడ్చుకోలేని వొంటరితనం....కాళ్ళుచేతులూరాని చీకటి ముద్దల్లా మనసులోవూహాలు-

నిజానికివూరంగా పరిగెడుతుందా-రైలు.

ఇరవై యేళ్ళనుంచీ యీ రైలు యిల్లాగే పరిగెడ్తూందా?

చనిపోయిన జల్సా కుర్రవాడు మళ్లీ లేస్తాడా ?

చనిపోయిన కోరికలు-

హాండ్ బ్యాగులోనుంచి అద్దాన్నిలాగి. మగవారు పగవారుగా గడిపిన యిరవై యేళ్ళకు వల్లి ....తనదికాని ముఖాన్ని తను చూస్తున్నట్లు, తనవి కాని కళ్ళలో తన్ను వెతుక్కుంటున్నట్లు, కనుబొమలు కుంచించి పెద్దవిచేసి-

వెన్నెల్లో? కౌగిట్లో?

గాలి-వాటంగా కిటికీ పొదిగిటను కూచున్న ఆమె చెంపల్ని తాకి ముంగురుల్ని సవరిస్తూంటే-ఆ చిలిపితనానికి, ఆ ఆక్రమించుకునే స్వభావానికి, పన్నాలుగేళ్ళ మరదలు పిల్లకుమల్లే-కెరటాల్లా వచ్చింది నవ్వు. అద్దం ఎవరో చేతిలోంచి లాక్కున్నట్లు వాళ్ళోకి వ్రాలిపోయింది.

ఒకప్పుడు తన్ను మీసాలపన్నాయని పిల్చేవారు.
జల్సా కుర్రవాడి గుండెలమీదా? కాదు-కాదు.
పన్నెండోయేటా? కాదు,
అల్లాటి పన్నెండోయేడు మళ్ళీ యెల్లావస్తుంది?

## 2

ముఖాలు అలుముకుపోయే చీకటి. చెట్ల కొమ్మలు సన్నగా వూగిస లాడ్తూ కదుల్తున్నాయి. అదేమంత పెద్ద స్టేషనుకాదు. రైలుకూడా యెక్కువసేపు ఆగేట్టులేదు. ఆ స్టేషనులో దిగిందికూడా తను వొక్కర్తే కావటం ఆమెకు విపరీతమైన విసుగును గలిగించింది. ఆ ప్లాటుఫారం చాలా దిగుడకువుండి నానా గతుకులుగాను అక్కడా అక్కడా చిన్న మొక్కలు మొలిచాయి. ప్లాటుఫారంమీద రెండే రెండు సిమెంటు బెంచీలున్నాయి. బెంచీలకు చేరువను అప్పుడే వెలిగించిన దీపం యింకా రాజుకొంటోంది. వల్లి తన సామాన్ను అతి కష్టంమీద బెంచీమీదకు చేర్చ కలిగింది, దూరాన వొకవైపునుంచి పొగలు సన్నగా మీది మీదికి తేల్తుండటాన్నిబట్టి వూరు ఆ వైపునని తెలుస్తోంది. ఆ స్టేషనుకటకటాల వెనుకంతా తోటలు, పొలాలు, దొడ్లు. బస్సుకాని మనుష్యులుకాని యెక్కడా చుట్టుప్రక్కల కనపడ్డంలేదు.

వల్లికేమీ పాలుపోవటంలేదు. ఆ స్టేషనుగుమాస్తా కాబోలు గార్డుతో మాట్లాడుతున్నాడు. తన్నెవరూ గమనించినట్లులేదు. అక్కడే తచ్చట్లాడుతూ యథాలాపాన ఆఫీసులోకి తొంగిచూసింది. ఒక నల్లటి

ప్రేతాకారం వోడ్చుతున్న బీరువా, దానికి కప్పంతతాళం-టిక్కెట్లుఅమ్మే కిటికీకి వో తలుపులేదు. ఏదో నగరంలోని చవకరకపు మురికి హోటల్లో లాగుంది. నేలంతా గరుగ్గా సిగరెట్టు, బీడీ పీకలు, చిందరవందరగా కాగితాలు-ఆ యిరుకులో వాక విరిగిపోయిన కుర్చీ దానిముందు పెద్ద డిన్నరు ఉేబులంత బల్ల. ఆ గుమాస్తా యిటువైపే నడచివస్తున్నాడు. ఇక్కడ్నుంచి బయటపడ్డం అనుకున్నంత తేలికగా వున్నట్లులేదు. చప్పున వెళ్ళి బస్సునందుకోగలిగితే, బహుశా మరో గంటా గంటన్నరకుగాని గమ్యస్థానం చేరుకోలేదు.

ఇంత దిక్కుమాలిన స్టేషన్ను యెందుకు కట్టినట్లు?

గుమాస్తా దీపం వెల్తుర్లోకొచ్చి నిలబడ్డాడు.

చాలా పల్చటి మనిషి - కుర్రవాడే-కులాసాగా నవ్వుతూన్నట్లుంది మొహం. రైలుకూడా నెమ్మదిగా తప్పుకుంది. తను యింకా టికట్టు యిద్దామనుకుంటూంటగానే అతడు చేతిని జాపాడు, ఈ వట్టి అట్టముక్క-కోసమేనా అని తను యింకా అనుకుంటూండగానే—

'ఈ బండిలో వచ్చారే?'

బస్సునందుకోవాలని చెప్పింది వల్లి.

'ఏ బస్సు? ఆఖరి బస్సు ఆరున్నరకే వెళ్ళిపోతుంది, ఈ బండి అరగంటపైగా లేటు....యిక్కడేంబళ్లు కూడా లేవే?'

వల్లి నిర్ఘాంతపోయింది.

ఈ సామానుతో వొంటరిగా తను యీ రాత్రంతా యెట్లా గడపటం? 'ఇక యీ పూట బస్సు దొరకదా?'

'ఇక్కడ మీకు తెల్సినవాళ్ళెవరూ లేరా?'

'నేను అమెరికను మిషనరీలు కట్టిన స్త్రీల అనాథశరణాలయానికి క్రొత్తగా వచ్చిన సూపరింటును.'

'ఓహో! అమెరికను మీషనరీలు కట్టిన స్కూలా?'

'నాకీ చోటంతా క్రొత్త. పరిచయంలేదు.'

'పది మైళ్ళ దూరాన అడివిలో కట్టారు, అడివిలోగాని దేవుడు లేడనా ?' క్షణమాగి-

'రాత్రి పన్నెండుగంటలకు వొక ప్యాసెంజరు యిట్లా వెళ్తుంది. అది యిక్కడ ఆగదు, రాత్రిపూటలీప్రాంతాలలో జంతువులు తిరుగు తూంటాయి, నేను ఆఫీసు మూసేసి వెళ్తే మళ్ళీ వుదయం యెనిమిది గంటలకు వస్తాను డ్యూటీకి. తొమ్మిది గంటలకు ప్యాసెంజరు. అందులో వుదయం రావలసింది మీరు.'

'ఇప్పుడు నన్నేం చెయ్యమంటారు ?'

'అదే నన్ను కాస్త ఆలోచించనివ్వండి. మీరు ఒంటరిగా యీ రాత్రి యెక్కడ వుంటారు ?'

కాస్త చిరునవ్వు వెలిసింది అతడి ముఖంమీద. ప్రక్కకు తిరిగి సిగరెట్టు ముట్టించి తీవ్రంగా ఆలోచిస్తున్నాడు.

వల్లికి అసహ్యంగా వుంది,

మోహం, ధనం అందర్నీ పెనవేసుగొనున్నాయి. స్త్రీలు వీటికోసం పురుషుల్తో చేయి చేయి కలిపి జీవిస్తారు. ఆడా మగా పందుల్లా గాడిదల్లా వుద్రేకాల్లో వ్యామోహాల్లో చిక్కుపడి జీవించటంవల్ల మానవ జాతి నానాటికీ పెరిగిపోతోంది, ఈ సృష్టిలో అందం యెక్కడుంది ? ఈ మనుష్యుల్లో పవిత్రత యెక్కడుంది ? నరరూప రాక్షసుల స్త్రీదాహానికి బలియైపోతూ భ్రష్టులైపోతున్నామని తెలుసుకోలేని స్త్రీలు – పెళ్లి అనే సంస్థతోనే నరకానికి త్రోవ యేర్పడిపోతున్నప్పటికీ తెలుసుకోలేని స్త్రీలు....ఈ ఛండాలాన్నంతా పెరికి పారెయ్యాలనే వుద్రేకం యిరవై సంవత్సరాలనుంచి పనిచేస్తోంది వల్లిలో. ప్రకృతిలో యీ సంక్షోభం లేదు. భూమి ఆకాశం సూర్య చంద్రులు యీ నక్షత్రాలు యివన్నీ సృష్ట్యాదినుంచీ యీ మనుష్యుడి వంకర టింకర నడకను కనిపెడ్తూనే వున్నాయి.

లోకం అంతా తప్పుదారినే నడుస్తోంది.

మనుష్యులంతా దుర్మార్గాలు చేస్తూనే వుంటారు.

కాని - కాని యీ లోకం పాపం చెయ్యకుండా యెప్పుడుంది?

అతను సామాన్లు ఆఫీసులో జేర్చి తాళంవేసి వస్తూ, పదండి అన్నాడు. వల్లి మళ్ళీ ప్రపంచంలో కొచ్చింది.

"మనం వూళ్ళోకి వెళ్ళి కాస్త టీ త్రాగి యెవరన్నా మనిషిని వెంటబెట్టుకొద్దాం. చలిగా వున్నట్లుంది. లేమా?"

ఈ కాస్త చలిలో అల్లా వొక మైలు నడచిరావటం తమాషాగానే వుంటుంది. చవకబారు మనిషిలా దారిప్రక్క హోటల్లో 'టీ' త్రాగడం ఆమెకు సుతరామూ యిష్టంలేదు. కాని తనకే కుర్రవాడంటే ఏం భయం? ఆమె ఆలోచిస్తూ నడుస్తున్నది. బండి చక్రాల గాట్లుపడ్డ దారిలో మన్ను మెత్తగా కాళ్ళకు తగుల్తున్నది. ఆమె తెల్లటి కుచ్చెళ్ళు దుమ్ము కొట్టుకు పోయి గోధుమ వర్ణం దాల్చాయి. ఎత్తు మడమల జోడుతో ఆ గతుకుల్లో నడవటం కష్టంగా వుంది. బాటకిరుప్రక్కలా కొబ్బరి చెట్లు గట్లు-మెలి కలు తిరిగి పారుతున్న పంట కాలువల సొగసు, నీటితో పూటుగా నిండి పోయి కలుపు మొక్కలు కూడా అగపడని తటాకాల్లా వున్న చేలు, దారిలో అక్కడా అక్కడా గట్లు తెంచుకొని చేలల్లోంచి పంటకాలువ ల్లోకి తిరగబడ్తున్న నీటి చప్పుడు వింటూన్నప్పుడు -- యీ రమ్యావలోక నలో, ఎత్తుగా బయటి ప్రపంచంతో తెగతెంపులు చేసుకున్నట్లుండే అమెరికను మిషనరీల కోట గోడలు, ఎర్రటి గడ్డాలతో యిహ లోకంలో భగవంతుడి ప్రతినిధులుగా చెలామణి అయే ఫాదిరీలు వల్లికి జ్ఞాపకాని కొచ్చారు.

వల్లి దేన్నీ క్షమించదు. ఏదీ సహించదు ఆమెకు.

ప్రారబ్ధవశాత్తూ వొక పచ్చి బాలెంత రాల్ని చూడ్డం తటస్థపడితే, తల్లికావటం స్త్రీకి యెనలేని ఘోర పాపమనీ, బోసినోటితో చూపుల్లో సైతం అపవిత్రతకు దొరకని పసిపాపలను పాపఫలాలని ఆవిడ తీర్మాని స్తుంది. పురుషులు స్త్రీలను ఆకర్షించుకుంటారనీ, యీ ఆకర్షణలో పడి

స్త్రీలు పాపపంకిలమైన జీవితాన్ని గడుపుతారని ఆమెకో దృఢమైన అభిప్రాయం వుంది. యౌవ్వనంలోకడుగుపెట్టిన ఆడపిల్లలు కిలకిలా నవ్వితే వల్లికి వళ్ళంతా ముళ్ళు గుచ్చుకొన్నట్లుంటుంది. తను వొక గొప్ప ప్రయోజనంకోసం పుట్టాననీ అందుచేత తతిమ్మా మనుష్యులకీ తనకూ వున్న అంతరం చాలా మహత్తమైనదని ఆమెకు చెరగని విశ్వాసం.

"ఈ గతుకుల్లో మీకు నడవటం కష్టంగా లేదూ?"

"ఫరవాలేదు."

అతని కళ్ళలో యేదో తళతళ-ఆశ లాటి మెరుపు, పెదవులపై దాచుకొంటున్నట్లున్న చిరునవ్వు.... ఒక చచ్చు రకపు అడదానితో నడుస్తున్నట్లు భావిస్తున్నాడు కాబోలు. వల్లి కాస్త గంభీరంగా చూసింది. శాశ్వతమైన సత్యానికి జీవితాన్ని బలి వేసే తనతో అడుగులో అడుగుకలిపి వేస్తున్నా యిద్దరి మధ్యా వున్న అంతరం అదో పెద్ద అఘాతం. అతని చెక్కిళ్ళు పొంగాయి. అతని బట్టలమీంచి గాలి మగవాసనను దులిపింది. ఇంకాయేదో రంగురంగులుగా ఆలోచిస్తున్నట్లున్నాడు, సిగరెట్టు ముట్టించి. వల్లి అనుమానంగా మళ్ళీ చూసింది. దారంతా యిద్దరూ చాలా దగ్గర దగ్గరగా నడుస్తున్నట్లే వుంది. ఆ నడిచే మెత్తటి దారి తప్ప యిరు పక్కలా యేవో ముళ్ళపొదలు, పిచ్చి చెట్లు-రకరకాల పూతలు గలగలలు వినిపిస్తున్నాయి. చీకట్లు పైనుంచి విసరబోసుకుంటున్నాయి. దూరంగా నిట్రాళ్ళమీద పాకలు-వాటి సందుల్లోనుంచి నీడల్లా మనుష్యులు మెసులుతున్నారు. ఊరు దగ్గర్లోనే వుంది. అతను చట్టున ఆగి సిగరెట్టు బాగా పీల్చి వదులుతూ —

"ఐతే మీరిప్పుడు ఎక్కడ వుంటారు?"

తన్ను బాగా ఆలోచించుకోమని అతడి వుద్దేశం కాబోలు. వల్లి నెమ్మదిగా తలెత్తి చూసింది.

"నేను బజార్లో చిన్న కొట్లో వుంటున్నాను. నాతో మిమ్మల్ని చూస్తే వెధవ పల్లెటూరి మూక-ఏమన్నా అంటారు. పైగా మీకనేక

అభ్యంతరాలుండొచ్చు." కొంచెం విసుగ్గా "ఆడవాళ్ళు ఆలోచించకుండా ప్రయాణాలు చేస్తారు."

వల్లి చురచురా చూసింది.

"పోనీండి-వూరికి అటువైపున వొక సత్రం వుంది. అది చాలా పాడుపడి వుంటుంది. అందులో మీకు భయంవేస్తుంది. ఒక్కరూ యెట్లా వుంటారు తెల్లవార్లూ...."

"ఎల్లాగో అవస్థపడతాను, నా సామాన్ను అక్కడకు చేర్పించి పుణ్యం గట్టుకోండి."

"నడవండి. ఎవరన్నా అడిగితే అమెరికను స్కూలుకి క్రొత్తగా వచ్చిన మిస్సమ్మగారని చెబుతాను."

పాకల్ని చుట్టి సందుల మెలికలన్నీ తిరిగి వూళ్ళోకొచ్చారు. అక్కడక్కడ గచ్చు అరుగుల పెంకుటిళ్లు నామమాత్రంగా వున్నాయి. దీపాలు సన్నగా లోపల్లోపల వెలుగుతున్నాయి. మనుష్య సంచారమే బొత్తిగా లేదు. వల్లి అనుకుంది —

నిద్రాళ్ళ పాకలు, పూరి గుడిశలు, మురికి చెత్త-చెదారము, అజ్ఞానం, చీకటి, దారిద్ర్యం, అనారోగ్యంతో మోకాటి చిప్పమీద కురుపుల్లా యీ గ్రామాలు దేశ భవిష్యత్తును కృంగదీస్తున్నాయి. వల్లికి భవిష్యత్తు మీద ఆశలేదు. జీవితంతో సానుభూతి లేదు.

## 3

'అతడు-ఆమె' వంతెనమీద కొచ్చారు.

ఊరు వెనుకపడిపోయింది. ఆ యిరుకైన కాల్వారికి చెరోప్రక్కా కొబ్బరి చెట్లు అందంగా నిల్చున్నాయి. ఆ వంతెన బాగా మెత్తుగావుంది. దిగువను చిన్న పూరిపాక వుంది. ఆ పాకను రాసుకుంటూ పంటకాలవ పరిగెడుతున్నది. కొబ్బరి మట్టలతో ఆ ముందర చిన్న పందిర వేశారు.

గోపల్నుంచి దీపం వెల్తురు వస్తున్నది, బాగా పరికిస్తే రంగు రంగుల
సాలు ముందూ వెనుకా ఒకటిరెండు యినప కుర్చీలు-ఖాళీగా వున్నాయి.
అది ఓ చిన్న బడ్డీ దుకాణం.

"అదిగో, అదే సత్రవు...." అతను చీకట్లో వేళ్ళు కదుపుతూ
చూపించాడు. వల్లికి యేమీ కనిపించలేదు.

ఒక విశాలమైన రోడ్డు తిన్నగా వెన్నెట్లో మెరుస్తున్నది.

"ఇక్కడే యీ వంతెనమీదే నిల్చుంటారా? నేనిప్పుడే వస్తాను."
అతను వంతెన పల్లంలోకి దిగి బడ్డీదుకాణంలోనికి నీడలా చొరబడ్డాడు.

ఊరికి దూరంగా కొబ్బరిచెట్లు మింగివేస్తున్న వెన్నెలలో ఎత్తుగా
వున్న వంతెన-వంతెనకు దిగువను నిశ్శబ్దంగా ప్రవహిస్తూన్న కాలువ-
కాలువను రాసుగుని పేదరాసి పెద్దమ్మలా కూర్చున్న బడ్డీ దుకాణం,
బడ్డీ దుకాణంలోనికి నీడలా అదృశ్యమైన కుర్రాడు-వంతెనమీద వొంట
రిగా తను....

ఆమె కళ్ళు దృగ్గోచరంకాని సత్రవును వెదుకుతున్నట్లున్నాయి.
జుట్టు ముఖంమీద కెగిరిపడ్తోంది. చీర కుచ్చెళ్ళు గాలికి బాగా, మీది
మదికి వూగిసలాడ్తున్నాయి. అరిచేతుల్తో ముఖం గట్టిగా రాసుకుంది.
పైర దులుపుకుని పవిటచెంగును బాగా బిగించి నడుముకు చుట్టుకుని నడ్డి
మీదనొక చేయినాన్చి వంతెనను రాసుకుంటూ నిలబడి ముందుకు చూసింది.
తెల్లటి చొక్కా రెపరెపలాడ్తోంది. ఆ వెనుక నింకెవరో కూడా వున్న
ట్లున్నారు.

"అల్లో...." పిలుపు వినపడ్డది. నడుంమీంచి చేతిని తీసివేసి వంతెన
కజాలని పట్టుకుని నీళ్ళలోకి చూస్తూ పెదిమ కొరుక్కుంది,

ఆ రెండవ మనిషి మహాకాయుడల్లే వున్నాడు. అంటగా కత్తిరిం
చిన జుట్టు నిలబడింది బిరుసుగా. ముఖం ఎగుడుదిగుడుగా కుడివైపు పల్లం
ఎడమను యెత్తుగా రెండు వేరువేరు ముఖాలను కలపటానికి ప్రయత్నించి
నట్లు వికృతంగావుంది, ఆ కారణంచేతనే కళ్ళు యెగుడుదిగుడుగావున్నట్లు

న్నాయి. మూతి కూడా వంకర తిరిగిపోయింది. చిరిగిపోయిన చాలీచాలని బనీను వేసుకున్నప్పటికీ గుండ్రటి పెద్ద పొట్ట బానలా ముందుకుతన్నుకొచ్చింది. బొడ్డుక్రిందకు మోకాళ్ళపైకి కట్టిన గళ్ళలుంగీ వినా మరో వస్త్రంలేదు. తడవమ్మా శరీరమంతా బొమ్మజెముడు కంపల్లేవుంది. ఎఱ్ఱ చీమల పుట్టల్లా కడుపుమీద ముఖం నిండా, భుజాలు, రొమ్ములమీద రోమ కూపాలు....బట్టలతో ఆ భీకరాకారాన్ని మరుగుపర్చాలని ప్రయత్నించటం చాలా విఫలయత్నమే కావొచ్చు. ఆ మహాకాయుడి చేతిలో వుగ్గు గిన్నెలా యిమిడిన 'టీ' కెటిల్‌లోంచి వెచ్చటి పానీయం కప్పుల్లోకి పరుగెడుతూన్నది.

వల్లి అప్రయత్నంగా తన దృష్టిని కుర్రవాడివైపు మళ్ళించింది. అతను టీ కప్పును తనకు అందించి, 'పట్టుకోండి!' ఈ 'టీ' ఎంత మజాగా వుంటుందనుకుంటారు? కోల్పోయిన చురుకుతనం నరనరాల్లో పరుగెత్తేవరకూ, యీ తాజా 'టీ'ని — మీ గొంతుకలోకి ప్రవహించనివ్వండి. కప్పు దించకండి — పొట్టంచే పొట్టు!!

త్రాగినవాడిలా మాట్లాడుతున్నాడే! యితను?

ఆ ఎలుగుబంటి ఆకారం తనకు దగ్గరగా వచ్చింది. వల్లి చేతిలోని కప్పు గజగజా వణికిపోతున్నది. ఆ కుర్రవాడు తమాషాగా మెరిసే కళ్ళతో తన వైపే చూస్తున్నాడు. ఈ కప్పు చేతిలోంచి జారిపోవచ్చు. ఈ వెచ్చటి టీ తన చీరమీద కొంతా, కాళ్ళమీద పడిపోవచ్చు. వల్లి గజగజ లాడిపోయింది. ఆ ఎలుగు బంటి ఎగుడు దిగుడు కళ్ళు కప్పులోకి ప్రవహిస్తున్న తేనీటిమీదే లగ్నమయివున్నాయి. ఒక గ్రుడ్డు బయటకు వెళ్ళుకు వచ్చినట్లు ఎఱ్ఱగా భీకరంగావుంది. రెండవ కన్ను సౌమ్యంగా లోపల్నుంచే లోతుగా దేనికో వెతుకుతున్నట్లుగా వుంది.

తను రోడ్డుమీద ఒంటరిగా నిలబడి టీ త్రాగుతున్నానన్న ధ్యాసే ఆమెకులేదు. భయంతో చప్పు చప్పున కప్పు ఖాళీచేసింది. అతను త్రాగండని మళ్ళీ మళ్ళీ హెచ్చరిస్తున్నాడు. ఈ మహాకాయుడు కప్పును నింపుతున్నాడు. ఆ తాజా పానీయం వెచ్చ వెచ్చగా నరనరాల్లోకి పరిగెడు

తోంది. మూడో కప్పుకూడా పూర్తయాక అనేకు చేతులు పట్టు తప్పి పోయాయి. వంతెనకు పూర్తిగా జారగిలబడింది ఆ కప్పు పక్కన జారి దిగువకు వంట కాలువలోకి దొర్లుకుంటూ పోతున్నది. ఆ ఒంటి కన్ను రాకాసి-మహాకాయుడు 'రే-రే' అంటూ వంతెన దిగువకు ఆతృతగా పరుగెత్తాడు. ఆ పరుగెత్తడం చీకట్లో ఒక గున్నయేనుగు నడుస్తున్నట్లుగానే వున్నది. కప్పు తెల్లగా దొర్లుకు పోతున్నది. ఆ ఎలుగుబంటి తప్పట్లాడుతూ తడుముకుంటున్నాడు. వంతెన గజాలమీదకు వంగిపోయి వల్లి, చేతుల్ని తడుస్తూ 'ఇక్కడ-యిదు-యిదు' అంటూ ఆ పర్వతాకారాన్ని కప్పువైపు మళ్ళిస్తున్నది,

అతడు తలెత్తి మీదకు చూశాడు-వంతెనమీద వయ్యారంగా తెల్లగా అందంగా వంగుని నీళ్ళలోకి చూస్తున్నతను....కప్పు ప్రవాహంలోకి పడిపోయింది. వల్లి బిత్తరపోయింది. కుర్రవాడు తనకు దూరంగా చేతులు కట్టుకుని నిలబడ్డాడు. ఆ మహాకాయుడు పళ్లు పటపట లాడిస్తాడా? గుడ్లురిమి చూస్తాడా? రెండు అరచేతుల్తో తన్ను ఎత్తి పొట్లంగా చుట్టి గిరాటువేస్తాడా!

రొప్పుకుంటూ ఆ కీచకుడు వంతెనకు ప్రదక్షిణం పూర్తిచేసి తమ వైపే వస్తున్నాడు.

'పదండి.'

ఉభయులూ గబగబా ముందుకడుగులు వేశారు, నీటిలోకి జారిపోయిన కప్పు, కొబ్బరి మట్టల నీడల్లో చలిలో వెలుగు నీడల్లో మిగిలిపోయిన వంతెన, బడ్డీ దుకాణం వల్లి మనస్సులోంచి చెరగకుండానే - 'యిదు, యిదు దుమ్ము ధూళి ఎక్కువగానే వుండొచ్చు - కాస్త కుచ్చిళ్ళు పట్టుగుని నడవండి' అన్న ముక్కల్తో వాడెవడూ, ఎవరో యెప్పుడో ఆశించినట్లు నిర్మించలేక అసంపూర్తిగా వదిలేసిన ఒక చాలా పెద్ద ప్రాకారం ముందుకువచ్చి ఆగారు.

సున్నం రాలిపోయిన యిటుకలతో, ఎత్తైన అడుగులు పెద్దపెద్ద కిటికీలు అవి నిశ్శబ్దంతో కీచులాడుతున్నట్లున్నాయి. ఒకవైపు భాగం

పూర్తిగా పతనావస్థలోవుంది. ఆ మునుముందు ఆవరణలో ఎవరో యెప్పుడో తవ్వాలనుకుని ఖాళీకై చేసిన ప్రయత్నమంతా ఒక పెద్ద అఘాతంలా, భయంకరంగా చుట్టూ పెరిగిన పిచ్చిమొక్కల్తో —జాగ్రత్తకై నలుగురూ వేసిన ముళ్ళకంపలతో కప్పబడివుంది. రాళ్ళు రాపాషణాలు వేసి అటువైపు కెవరూ పోకుండా కట్టుదిట్టంచేసినట్లే అవుపిస్తోంది. ఆ పొదల మాటునుంచివస్తూ-చేతిలో పెద్ద గొంగళీ రెండుగోనె పట్టాలు పెద్ద చీపురుకట్టలో బడ్డేముకాణం తాలూకు భీకరమూర్తి దర్శనమిచ్చాడు.

వల్లి జడుస్తూ జడుస్తూ మెట్లన్నీయెక్కి అరుగుమీదనిల్చుని లోనికి చూసింది. కిటకీలకుగాని ద్వారాలకుగాని తలుపులువున్నట్లులేవు. అన్నీ ఎవరికి దొరికినవి వారు పీక్కుపోయివుంటారు, మధ్యహాలులోయెక్కడ చూసినా గచ్చు పగిలి నేలంతా బీటలు వారివుంది. అక్కడా అక్కడా లెక్కలేనన్ని పొయ్యిలు - మూడేసిరాళ్ళు పర్చివున్నాయి. హాలులో మీద నున్న దూలానికి త్రాళ్ళతో పిల్లలకు వుయ్యాలలు వేశారు. గోడవారన నలిగి ఎండిపోయిన బంతిపూల కుప్పలు-పగిలిపోయిన మొరుపు, ఆకు పప్పుగాజులు, తిని పారవేసిన పకోడీ మిఠాయి పొట్లాల తాలూకు ఆకులు, దారాల్ని వల్లి చూడగలిగింది. సిగ్గుతో అవమానంతో ఆమె తలెత్తి ఆ కుప్రవాటి ముఖంలోకి చూడలేకపోయింది. అతను లాంతరు చేత్తోపుచ్చుగుని నడుస్తున్నాడు. అదే హాలులో నొకమూల చీపురులో నేలను శుభ్రపరిచేయత్నంలో అ మహాకాయుడు విశేషించి శ్రమపడ్తున్నాడు.

వల్లికి లోపల యేదో చెప్పలేని భీభత్సం రాజుకుంటోంది. ఈ దుమ్ము ధూళి-చీకట్లో కాలికింద బరబరలాడే యిసుక రాళ్ళు: ఈ శిధిలమయ వాతావరణంలోనేనా తమ ఆడది వొంటరిగా యీ రాత్రి గడపవలసింది? ఒంటరిగా హీనంగా, తన్ను తాను నిందించుకుంటూ ఈ మూలలనూ గోడలనూ తిట్టుకుంటూ భయంకరంగా యీ రాత్రి గడిచి పోవలసిందేనా? ఇదేమిటీ శిక్ష? ఎవరి కింతకక్ష నా మీద?

చేతుల్ని నలుపుకుంటూ - చిరాగ్గా నేలనిబాదుతూ అటూ యిటూ తచ్చాడింది.

ఆ మొఖముమనిషి-అకుప్రవాడు వుభయులూ అరగంటకు పైగా చాలా యమయాతనపడి ఆ హాల్లో కొంత భాగాన్ని తల దాచుకుందుకు అనువుగా తయారుచేశారు. ఆ తలుపుల్లేని కిటికీలకు గోనుపట్టాలు కట్టారు. నేలమీద దులిపిన కంబళీని పరిచారు. ఎదురుగుండా లాంతరు వుంచి యిద్దరూ తృప్తిగా ప్రక్కకు తిరిగి వల్లివైపు చూశారు, ఆమె యింకా బోనులో పులిలా చిరాగ్గా పచార్లూ చేస్తోంది.

'నేననుకున్నాను-మీకు కోపం వస్తుందని. నాకు తెలుసు - మీ రిల్లాటిచోట వుండటానికి యిష్టపడరు. కాని ఏం చేస్తాం? వోపికపట్టండి. మోతీ, వాడి ఆకారాన్నిచూసి మీరు ఝడుసుకునుంటారు. చాలా నమ్మకస్తుడు. మీరు మీసామాను వచ్చాక తీరిగ్గా ప్రక్క పర్చుకుని విశ్రమించొచ్చు. మీకేమీభరవాలేదు, ఉదయం వాడేవచ్చి మిమ్మల్నిబస్సు యెక్కిస్తాడు. మరి నేను వెళ్ళి తాజా గరంగరం రొట్టెలు చేసుకురానా?'

ఆమె నవ్వలేదు-అతడు ఆశించినట్లు.... అయోమయంగా చూసింది?

"నన్ను నమ్మండి. మీరు సురక్షితమైన చోటులోనే వున్నారు. మోతీ నక్కడికి జవాబు చెప్పగల మగవాడెవరూ యీ చుట్టుపట్ల పది మైళ్ళ దూరంలో లేడు."

ఇదేవిటీ పిరికితనం? వల్లికి తనమీద తనకే గొప్ప చిరాకువేసింది. అతను చెప్పుకుపోతున్నాడు.

"కొంచెం మనస్సు సరిచేసుకోండి. ఒక్క రాత్రి వుంటారు మీ రిక్కడ-మనకు సరిపడని సంగతులనేక ముంటాయి. నచ్చనంత మాత్రాన భయపడి-బాధపడి ...."

వల్లి గాఢంగా నిట్టూర్చింది.

"కుంపటిమీద పాలు వెచ్చబెట్టుకుని-యేదన్నా పుస్తకం లేదూ?

చూస్తూ కూర్చోండి. గంటలో మీ సామాను రొట్టెలు అన్నీ వస్తాయి. హాయిగా పాలుతాగి—"

"నాకేమీ ఆకలిగా లేదండి. నా సామాన్ను పంపించండి చాలు!"

"నమ్మమంటారా మీ మాటలు...." అంటూ చేతి గడియారం చూసుకుని "ఎనిమిది దాటింది-" అని అతను వెనుదిరిగి బడ్డీ దుకాణం దాటి వంతెనమీద కొబ్బరిసుట్టల్లో కొచ్చి అదృశ్యమై పోయాడు.

తన్ను గూర్చిన ఆందోళన, ఏమవుతాననే భయం తన జీవితంలో ఈ రోజే మొం ప్రథమంగా వల్లిని ఆవహించింది. ఆ వంతెనమీద అట్లా అయిపోయిందే తను-అనుకోని సన్ని వేశాల్లో అలవాటు లేని చోట్లలో మనుష్యల్తో వొంటరిగా చిక్కుడిపోయినప్పుడు తన స్వాధీనం తప్పి పోయి తనేమి చేస్తున్నదో కూడా తనకు తెలియకుండా పోవటం యిది సంభవమని-గుర్తించ తలిగింది.

ఇది చాలా ప్రమాదకరమైన నిజంలా వల్లికి తోచింది.

రాజుకొంటున్న ఎర్రటి రాక్షసి బొగ్గు కుంపటి చీకట్లో కదుల్తూ రావటం ఆమె పశ్చాత్యసగా చూసి, వులిక్కిపడింది. మెట్లమీద వొక మనుష్య పర్వతం తనవైపు కదుల్తూ వస్తున్నది. వల్లి బహు జాలిగా చూసింది బెదురుతూ, బెదురుతూ, తను కూడా అబలేననిన్నూ, ఎట్టి పరిస్థితుల్లోను, ఎటువంటి ప్రదేశాల్లోనూ, ఆత్మ స్థయిర్యాన్ని చిక్కబట్టుకో గలిగే మనోదారుఢ్యం తనకింకా అలవడలేదనీ-యీస్థితిలో తాను వొంటరిగా అనూహ్యమైన వాతావరణంలో పడిపోవడం తప్పకుండా తన ప్రారబ్ధమేనని ఆమె వూహించసాగింది.

మోతీ చీపురుతో మళ్ళీ వొకమారు జాగా శుభ్రంచేశాడు. గోనె పట్టా అట్నుంచి యిటూ యిట్నుంచి అటూ వొకటికి రెండుమాట్లు త్రిప్పి సరిగా వేసినట్టు తృప్తిపడ్డాడు. ఈ మధ్యలో రాక్షసి బొగ్గు కుంపటిని వుంచి ఆమెకేసి చూసాడు. అంత మనిషివైపు నడచి వెళ్ళటానికామె సాహసించటం లేదు.

ఆ పాడు సత్రమంతా ప్రతిధ్వనించేలా మోతీ బిగ్గరగా నవ్వాడు. వల్లికి ముచ్చెమటలు పోయసాగాయి.

అతడు లేచి ఒక కర్ర చేత్తో పుచ్చుగొని ద్వారంవద్ద ఆగి—

'మనిషి యింత లావూ పొడుగూవుంటే బద్మాష్ అయిపోతాడు. పతలావుండి అంగుళముంటే అచ్చా ఆద్మీఅని సెపెతారు. ఇది పెద్దది వుండాలమ్మా!' అని ఛాతీమీద చరుచుకుని 'మిస్సమ్మా! మోతీసెప్తాడు విను. డ్యూటీకన్నా హేట్టిగొప్పది? మన డ్యూటీ మనంచేస్తే అది దేవుడికన్నా గొప్ప అంటాను.' ఆ మాటల్ని చాలా హొత్తి హొత్తి తృప్తిగా అనుకుంటూ మోతీ అక్కడ్నుంచి వెళ్ళిపోయాడు. కాని ఆ నవ్వు వుక్కిరి బిక్కిరై ఆ సత్రములో యింకా మారుమ్రోగుతున్నట్లే వుంది. వల్లిని ఆలోచనలు తరుముకు రాసాగాయి.

ఒక ఆదర్శంకోసం స్త్రీ జీవితాన్ని వొంటరిగా గడుపదల్చుకుంటే, లోకం సహించలేదా? ప్రకృతి, మనుష్యులు కూడబలుక్కొని కుట్రా కుతంత్రం నలిపి పగదీర్చుకోబోతున్నారు. సేవాధర్మానికి జీవితాన్ని అంకితంచేసిన తనకీఅర్ధాంతరపు మజిలీ? ఏమికానుందో .... క్షణంలో ఆమె మనస్సుమార్చుకుంది. ఈ శరీరాన్ని మలినపర్చిజీవచ్ఛవంకావటంకన్నా కణకణమండే ఆ రాక్షసి బొగ్గు కుంపటి యెల్లాగూ తనకు మార్గాంతరం చూపించకలదు. కాని మరుక్షణంలోనే ఆమె ముఖం తెల్లగా పాలిపోయింది. తను దిక్కుమాలి వొంటరిగా 'ఆత్మహత్య' చేసుగుని మరణిస్తే-ఈ పాడు సత్రములో తన శవాన్ని....యీ జరిగించిన కోర్కెల గూడుని, నల్లగా బొగ్గు బొగ్గయి ముద్దలుకట్టి పేశంలాకారిపోతున్నశవాన్ని చూసి 'అయ్యో! పాపం' అనేవారుకాని 'నాద'ని కోల్పోయినందుకు ఒక కన్నీటి బొట్టురాల్చే ప్రాణిగాని వుండరు-వుండకూడదా? అని కూర్చుని చనిపోవటాని కేమొచ్చిందిప్పుడు?

పిచ్చి పిచ్చిగా నవ్వేసింది తనలో తాను.

'ఇక్కడ్నుంచి పారిపోతే?'

'పారిపోవటం ఎక్కడికి?'

అమెరికను మిషనరీల కోటగోడలు కబంధ హస్తాలను చాచి ఆహ్వా నిస్తున్నాయి. అనాధ శరణాలయపు పిల్లలు వంగి వంగి సలాములు చేస్తు న్నారు. తెల్ల బుఱఖాల్లో ఫాదిరీలు వల్లికి దేవుని కుమారుడ్ని జ్ఞప్తిక తెస్తున్నారు.

కాని యీ పాడు సత్రపు గోడల్లో....వల్లి లాంతరు తీసుకుని లేచి నిలబడింది. ఆ గోడలమీద యేవో రాతలు గీతలు బొమ్మలూ వుంటాయని తెలుసు. ఈ అర్థంకాని మహాకావ్యం యేంచెబుతుందో తెలుసుకోవటానికి తహ తహ యెక్కువైంది లోపల.

బొగ్గుతో ఏవో సమాంతర రేఖలు-తెలుగులో హిందీలో ఎవరెవ రివో పేర్లు-పొడి అక్షరాలూ-మిగతా ఖాళీ గోడలంతా యెవరెవరివో ఆడవాళ్ళ పేర్లు మగవాళ్ళ పేర్లతో వుటంకించబడి నానారాతలు రాసి వున్నాయి. దీపం యింకాస్త ముందుకి జరిగింది. వల్లి బుగ్గమీద చేతి నాన్చి నిశ్చలంగా చూస్తూ నిలబడిపోయింది. వివస్త్రగా ఆడదాన్ని చిత్రించ డానికి ఒక విఫలయత్నం జరిగింది. కాని ముఖ్యాంగాలన్నీ వున్నాయి. వల్లికి ఆశ్చర్యం వెయ్యలేదు. కోపం రాలేదు-దీపం పట్టుగున్న చేతిని కాస్త ముందుకు జరిపి యింకా రెండడుగులు వేసింది.

కేవలం బొగ్గుతో వ్రాయటంతో తృప్తిపడలేని కొందరు శాశ్వ తంగా మేకుల్తో కొంత శిల్పాన్ని కూడా ప్రదర్శించారు. ఈ పరిశ్రమ యావత్తూ శరీరంలోని కొన్ని ముఖ్య భాగాలపైనే జరగటం గమనార్హం. వల్లికి పగిలిపోయిన గాజులు బంతిపూలచెండ్లుమిఠాయి పొట్లాలదారాలు మళ్ళీ కనిపించాయి. గట్టిగా కళ్ళు మూసుకున్నా ఏవో నిట్టూర్పులు-కిల కిలా నవ్వులు-ఛెంగుమని దూకినట్లు, ఎవర్నో వాడిసిపట్టుకున్నట్లు కేరలు కూతలు-గలగలామని గాజులు చేసే చప్పుడు, వెచ్చని గాడ్పులు వేడి నిట్టూర్పులు....చెవుల్లో, కళ్ళముందు దగ్గరగా పెనవేసుకున్న శరీరాలు గిరగిరా తిరుగుసాగాయి.

పొయ్యిమీద సలసలా మసిలిన పాలలో ఒకెంచుక పంచదారవేసి చల్లార్చి ఆ నురగలను పెదిమలకు తాకించేటంతలో, గాలివానలాదూలాల మీంచి వురికివచ్చినట్లు నిలచి పెనుభూతంలా తిట్లు చెరుగుతోంది ఒకస్త్రీ.

వల్లి గాబరా అయిపోయి పాలగ్లాసును క్రిందకు దింపిన చేత్తో లేచి నిలబడింది.

“ దిక్కుమాలి ముండా --

నీ బస్తీ సోకులుగాల — సచ్చిందానా !

నువ్వెక్కడ్నుంచి తగలడ్డావే? రారయ్యో! యీ దిక్కుమాలిం దాన్ని మెడబట్టుకు యీదిలోకి తోలండర్రో - నా వుసురుపోసుకుందుకు వచ్చావా? ఈ దెయ్యాన్ని తెచ్చినప్లే కానుకోపోయాను. సలిలో బిడ్డలు కప్పుకొనే గొంగళిగూడా తెచ్చి నీ కాళ్లకింద పడేసింది, ఈ దిక్కుమాలి సత్రవు నాకొంపదీసెయ్యటానికిగాని-మాతల్లో! నాబొగ్గుల కుంపటీ యెత్తుకొచ్చి నీ యెదాన్న పెట్టాడు. ఇంటికాడ పసిబిడ్డ సావుబతుకుల్లో వుండి యెద్దుగుడికి కబురెట్టికెల్లమంటే, యిదా యీ బస్తీదానితో కులకాటవా? ఛూ! గోరకలి - గోరకలి!!” అని ఖాండ్రించి ఆ ప్రక్కనే వుమ్మేసి మెటికలు విరుస్తూ —

“ నడు నడు! పాపిష్టిదానా! కదుల్తావా — బొలికరింగబోడవ ముంటావా?”

వల్లి చరచరా యీవలకువచ్చి ఆ గోనుపట్టాలు గొంగళీ పెరికి దూరంగా గిరాటుపెట్టి ‘ఫో! ఫో! నీ కుంపటి నువ్వుపట్టుగుపో!’ అని చిరాగ్గా పాలగ్లాసును ఫెడీల్మని తన్నేసింది,

“సరిగ్గా చూడు! నాకేసిచూసి మాట్లాడు. నేనెవర్ననుకుంటు న్నావు? అయ్యో! అయ్యో!” అని తల పట్టుగుని కోపంగా “ఎవరు? నువ్వెవరు? నన్నెందుకిల్లా పిశాచంలా పట్టుగున్నావు?”

ఆ జానపద స్త్రీ అక్కడే కూర్చుని కాస్సేపు వికారంగా సోక

న్నాలు పెట్టి పెట్టి యేమనుకుందో చల్లగా జారుకుంది అల్లరీ ఆగమూ పూర్తయాక.

ఆ వెనక మరో పది నిముషాల్లో యిందాకటి కుర్రవాడువచ్చి "యిక్కడకు ఎవరుగాని వొక పిచ్చిమనిషి వచ్చిందా - యేడుస్తూ...." అని వల్లి ఐక్కుటూ అంతా చెప్పాక ఆశ్చర్యం కనబరుస్తూ— "క్షమించండి. ఆ పిచ్చిది దానికి పూర్వం చంటి బిడ్డడు వొకడు పోయాడు. ఆడది కనబడితే తన భర్తను వల్లోవేసుగోవటానికి వచ్చినట్లే తిట్టేస్తుంది." అని అతడు గబగబా ఆ కంబళ్ళన్నీ సర్దాడు. ఆ కుంపటి సరిచేసి తాను తెచ్చిన ఆహార పదార్థాలన్నీ భద్రంగా నేలమీద పర్చాడు.

## 4

వల్లి గొంగళిమీద ఖాసింపట్టు వేసుగొని కూర్చుంది. ఎదురుగుండా నేలమీద పళ్ళాలు, కొంత తిని విడచిన పదార్థాలు స్పష్టంగా కనిపిస్తున్నాయి. అప్పటికి తనకూ మధ్యన సిగిడీ కుంపటి రాక్షసిలా నవ్వుతున్నది. అనేకానేక జిహ్వలతో ఆ గోడలను సత్రపును మనుష్యులను నాకుతున్నట్లున్నది. రెండునిముషాల మౌనం - పిదప మోతీ వల్లి తాలూకు సామానుతో లోపలకు ప్రవేశించి యిద్దరి ముఖాల్లోకి చూసి చప్పట్లు చరుస్తూ బిగ్గరగా నవ్వాడు. మళ్ళీ ఆగి సిగిడీమీద అరచేతుల్నికాల్చుకుంటూ తను కూడా చెప్పదల్చుకున్నదేదో వున్నట్టు సత్రపు గోడల్ని కలయచూస్తూ— మాటలకోసం విశేషించి ప్రయత్నం చేయసాగాడు. అతనికళ్ళు ఎర్రగా జ్యోతుల్లా వెలుగుతూండగా-వంకర తిరిగిపోయిన పెదిమను పళ్ళు బిగబడుతూండగా, తనలో తాను మాట్లాడుకుంటున్నట్లు మొదలెట్టాడు.

లోనికి దిగిపోయిన కన్ను మెరుస్తోంది. నెత్తిమీద జుట్టు నిలబడసాగింది.

"వయసులో నున్నప్పుడు విచ్చలవిడిగా తిరిగేవాడ్ని, సంత రోజుల్లో బజారులో, కోతలప్పుడు 'చేలల్లో,' ఎక్కడబడితే అక్కడ

ఎప్పుడుబడితే అప్పుడు. నా బీడీలు చుట్టలు తినుబండారాల దుకాణం కేవలం నిమిత్తమాత్రమే-పెద్దపెద్ద రహదారులు కొట్లాటలు వచ్చినప్పుడు నాకు చాలాపని తగుల్తూండేది. గాలావులు సారాలో స్నానం చేసే వాడిని. కాని నా కింత బలం శక్తీవున్నా-ఎదురుగుండా మెరికలాటి ఆడది నిలబడిచూస్తే నవ్వితే నేను గాబరాపడిపోయి పారిపోదాం చేవాడిన్ని, నా కళ్ళ ఎదుట ఆడది పడనసుకో - నవ్వరాదు. వెట్టివికారపు చేష్టలు చేయకూడదు. ఈ రోజుల్లో నా వెంట వొకస్త్రీ పగబట్టినట్లు తిరిగింది. చేలల్లో నా కూడా వచ్చేది....వొళ్లూ....కళ్లూ....మూతీ....ముక్కూ.... త్రిప్పుకొంటూ-అది నాతో స్నేహం చేసుకుంది. చేలగట్లులో, పుంతల్లో సంతల్లో చీకట్లో, వెన్నెట్లో....దానివెంట కుక్కలా తిరిగాను. అది వేళ్ళతో తాకితే, ఆ మెడ నాకు కనిపిస్తే - ఆకళ్ళ నాలోకి చూస్తే నాకు ఆవేశం వచ్చినట్లుండేది. గొడ్డును బాదినట్లు బాదినా .... తీరనికసి ....నా చేతుల్లో దాన్ని నలిపినలిపి లుంగలుచుట్టుకుని బూజాన్నేసుకుని ప్రళయకాలరుద్రుడిలా తాండవంచేద్దా మనిపించేది. దాని ముఖం పక్క, దానిగ్రుడ్లు పీకి ఆగుంట్రటి బుజాల్ను వొత్తుతే-నస్మం చినిగి కండరాలు కరిగి వ్రేలాడిపోతే, ఎముకలు ఫెళఫెళమంటే ఆ భీభత్సంలో ఆమె రక్తాన్ని నా నరనరాల్లోకి ఎక్కించుకోవాలని 'తహతహ' లాడేవాడిన్ని, నాకు బాగా జ్ఞాపకం! ఆ రోజు సంత....నా టీ దుకాణంనిండా జనం రద్దీగా వున్నారు. ఊపిరి సలపటంలేదు. బేరాల్తో-సాయంత్రం మబ్బేసుకు పోయింది. ప్రక్కగా పశువులసంత....రకరకాల ఆవులు దూడలు కోడెలు అన్నీ నిగనిగలాడుతున్నాయి. ఈ సంతలో మబ్బేసుకుపోయిన సందట్లో కిలకిలా నవ్వుతూ ఎవరితోటో పరాచికాలాడ్తూ యీ పశువు నా కగ పడింది. దాని గొంతుకే గుర్తు నాకు. చూశాను. ఆవుమీద వెల్లకిలా పరుండి పైకిచూస్తో బాతాఖానీ కొడ్తోంది. నాకు వెర్రెత్తిపోయింది.... దుకాణం వదిలేసి పరుగెట్టాను. రెక్కపుచ్చుగు విసురుగా లాగాను. కుయ్యో! మొర్రో అంది. పదమంటూ కొంగట్టుకు లాగాను. రెండు చేతుల్తో మొత్తేసింది, పట్టు విడిపించుగుని వెనక్కు పారిపోబోయింది. నా కావేశం వచ్చింది. రాళ్ళు విసుర్తూ ఏవేవో తిడుతూ దూరదూరంగా

ఛెంగుమంటూ పోసాగింది. అలసిపోయేవరకూ పరుగెత్తించి. ఆఖరికి చేలో వొడిసి పట్టుగున్నాను. పకపకా నవ్వసాగింది. మోతీ అని నా రొమ్ముల మీద వాలిపోయింది. కళ్ళలోకి జాలిగా చూసింది. నేను వశం తప్పి పోయాను-అంతే! దాన్ని చెండులా నలపడంతో ఆరంభమయింది వికారం. వూపిరి సలపనివ్వలేదు. కాళ్ళతో పెనగులాడింది. గోళ్ళతో రక్కింది. నోటితో కొరికింది. నాలోని పశుత్వం పూర్తిగా విజృంభించింది. ఆక్రమించుగున్నాను. అనుభవించాను. నెత్తురుముద్దలా నిస్సహాయంగా పిచ్చికలా చేలో వ్రాలిపోయింది.... నన్ను తిరిగి భయం ఆవేశించింది. దాన్నట్లా వదిలి చేలకడ్డంబడి పరుగుచ్చుకున్నాను, ఆ నెత్తుటి మడుగులో నిస్సహాయంగా మరకలు మరకలు వేసిన గుడ్డల్తో వూళ్ళోకి రాలేక సిగ్గుపడిపోయి చెరువులో కురికేసింది. ఆ నెత్తుటి మడుగు యింకా నాకు గుర్తు కొస్తూనే వుంటుంది, ఆ రక్తం వెచ్చగా యింకా నాలో ప్రవహిస్తూనే వుంది. మళ్ళీ తరువాత నా కెప్పుడూ యే ఆడదాన్ని చూసినా పిరికితనం రాలేదు. ఆవేశమూ లేదు. ఇప్పుడు కాదు ఇంకెప్పుడూ రాదు. నేను కృంగిపోయాను.'

వల్లి నిశ్శబ్దంగా వంచిన తల యెత్తకుండానే వింది. సత్రపు గోడ మీద పిచ్చిరాతలన్నీ నిజం పదేపదే చెబుతున్నట్లుగా వుంది. ఆ కుర్రవాడు కొంచెంసేపు విసుక్కున్నాడు.

'నడూ. బయటకు నడు చెప్తాను. ఏమిటే పిశాచంలా పట్టుకున్నావు?'

కీచురాళ్ళగోల ఎక్కువగా వినిపిస్తోంది. ఆ మహాకాయుడూ యీ లేత కుర్రవాడూ వాకిట్లోకి వచ్చి నిలబడ్డారు. కప్పల బెకబెకలు-సత్రపు గోడల్లో మూలను నక్కివున్న గబ్బిలం రెక్కలు టపటపా కొట్టుగుంటూ అలంగం తిరుగ సాగింది మీద.

'ఆడవాళ్ళను ఎందుకట్లా భయపెడ్తావ్?'

మోతీ ముసిముసిగా నవ్వాడు-"మీ....సా....ల....మ్మా....యి....!

"ఛప్నోర్మూయ్! నీరూపం చూసుగో....బానలా కడుపూ....ఎగుడు

దిగుడు కళ్ళు....వంకరముాతి ...నిన్ను చూస్తేమట్టుగు వళ్ళు కంపర మెత్తిపోదూ?"

మోతీ....'నాకామెనుచూస్తే భయంగావుంటుందండి అబ్బాయిగారూ.'

"నువ్వింత పిరికిసజ్జు వనుకోలేదు."

"..........

"ఎందుకు వున్నావ్ మళ్ళీ....బ్రహ్మాజెముడు కంపల్లే....వెళ్ళ యింక యీ అర్ధరూపాయి తీసుకునిపోయి యేడు. మళ్ళీ వచ్చి మొద్దులా కదలకుండా అరుగుమీద పండుకో....తెల్లారి మిస్సమ్మను బిస్కెక్కించి మళ్ళీ కనపడు."

మోతీ మాట్లాడకుండా ఘటాన్ని రోడ్డుమీదకు చేరవేస్తున్నాడు. "మిస్సమ్మగారూ! దయుంచండి. మీకేం ఫరవాలేదు-మోతీ అరుగు మీద పరుంటాడు...."మాటలు చీకట్లోకలిసిపోయాయి-కుర్రాడు అదృశ్య మయ్యాడు.

## 5

వల్లి లోపల్నుంచి వచ్చి వాకట్లో గడపవద్ద వయ్యారంగా నిల బడింది. ఆమెకు మోతీ సందర్భ శుద్ధి లేకుండా చెప్పిన కధనమంతా కళ్ళ ముందు తిరుగసాగింది, "నరపశువు" అని గట్టిగా చీత్కారంచేసింది. ఆ కుర్రవాడు జిత్తులమారి నక్కలా గోచరించసాగాడు. ఈ వొంటరి తనాన్ని తనమీద వినియోగించుకోవాలన్నట్లుగా అతడి చేష్టలు దొంగ నవ్వులు, రొట్టెలు కాల్చుకురావటం. కులాసాగా మాట్లాడ్డానికి ప్రయ త్నించడం అన్నీ తలపుకొచ్చాయి. ఛీ! ఛీ! ఏమి మగవాళ్ళు? ఎంత స్వార్థం? ఎంత నైచ్యం?

—వొక శని విరగడైంది.

కాని అంతకన్నా భయంకరమైన పీడ యింకా తన్ను వెంటాడు తున్నట్లే వుంది.

ఈ మోతీ ఎక్కడకు పోయాడు?

ఆమె అనుమానం నిజమయ్యేలాగునే వుంది.

అతని కళ్ళలో యింకా దాహం తీరనట్లే వుంది. ఆ బ్రహ్మరాక్షసుడు కంపలాంటి శరీరం తనకు దగ్గర దగ్గరగా వస్తున్నట్లే వుంది, ఎర్ర చీమల పుట్టల్లా పెరిగిన బుజాలు ఎదురు రొమ్ములు భయంకరంగా తన ముఖాన్ని వక్షాన్ని ఆక్రమించుకున్నట్లే....ఆ బలమైన చేతులు పొట్లంలా తన్ను చుట్టి....తన బుగ్గలు చెంపలు నడుము కాళ్ళు అన్నింటినీ అణుస్తూ క్రూరంగా నెత్తుటి మడుగుచేసి మాంసపు ముద్దలా సత్రవులో తన్ను వదిలి చప్పట్లు చరుస్తూ భీకరంగా నవ్వుతూ పారిపోతాడు గావును చేల కడ్డం బడి.

వల్లి గజగజా వణికిపోయా వచ్చి కూలబడిపోయింది హోల్డాలు మీద.

హఠాత్తుగా ఆమె నేత్రాలు విస్ఫులింగాల్లా మెరవసాగాయి.

వీల్లేదు. అట్లాకాదు, కారాదు.

ఈ కుంపట్లోని రాక్షసి బొగ్గుతో ఆ పర్వతాకారాన్ని దగ్ధపటలం కావిస్తాను. ఈ గోళ్ళతో రక్కి యీ పళ్ళతో పీకి ముక్కలు ముక్కలు చేస్తాను. నరపశుత్వానికి బలై పోయిన ఆ అజ్ఞాత స్త్రీమూర్తికి యీ మూర్ఖుడి క్రొన్నెత్తుటితో తర్పణ కావిస్తాను. ఒంటరిగా ఆడవాళ్ళను కబళింపచూసే అమానుషత్వానికి శాశ్వతమైన గుర్తుగా యీ మహాకాయుడ్ని బలిదీసు కుంటాను.

కాని....ఎట్లా....ఎట్లా....ఎట్లా???

వల్లికి ఎక్కడలేని చురుకుదనం చైతన్యం లోనుంచి వచ్చేసింది.

తెలిసిపోయింది—యీ కుట్ర బాగా తెలిసిపోయింది. కనుక యిక క్షణం జాగుచేసినా లాభంలేదు. తను లొంగిపోవటం అనేది స్వప్నంలో కూడా జరుగదు. ఈ ఎంతకూ తరుగని రాత్రి-యీ చలిలో, యీ శిథిల

మయ వాతావరణంలో భీభత్సరస ప్రధానమైన ఘట్టానికి నాందీప్రస్తావ నలు యేర్పాడ్డాయి. తెల్లవారి-నెత్తుటి మడుగులో, ప్రజలు-వొక చెరచబడ్డ పతివ్రతనో....వొక మరణించిన మహా కీచకుడ్నో చూస్తారు.

వల్లి గబగబా తన పెట్టి తెరిచి బట్టలన్నీ చిందరవందర చేసి వెతికింది. ఆమెకు ఒక బత్తాయి చాకు తళతళా మెరుస్తూ చేతికి తగిలింది. అంతలో ఆమెకెక్కడలేని వుత్సాహం వుప్పెనలా వచ్చిపడింది. ఆమె కళ్ళు నెత్తుటి దాహంతో జ్యోతుల్లాగున్నాయి. ఆ కత్తితీసి మొలలో గుచ్చింది. ఇప్పుడు నిర్భయంగా వుండొచ్చు-ఫరవాలేదు. తెల్లవారేలోగా యే పశువుకైనా తిన్నగా బుద్ధి చెప్పగలదు వల్లి. ఆమె జుత్తు బాగా చెదిరిపోయింది. బీభత్సంగా ఆలోచించటంవలన ఆమె కళ్లు ఎరుపెక్కి తీక్షణంగా వున్నప్పటికీ ఆమె కనురెప్పలు బాగా బరువెక్కిపోయు న్నాయి. కీచురాళ్ళ కప్పల రోదన ధ్వనులు మిన్నుముట్టాయి.

ఆ కుంపటికి ఎదురుగా పెట్టెమీద వున్న హోల్డాలుమీద ఆమె కూర్చుని అల్లానే నిద్రపోయింది. గాలి బ్రహ్మాండంగా అపరిమితమైన వేగంతో వీవసాగింది. దుమ్ములేచిపోయి ఆ సత్రవును ముట్టడించింది. నల్లటి కారుమబ్బులు దిగువను ఆకాశంలో సంచారం ప్రారంభించాయి. కొద్దిసేపటికి పెద్ద జల్లుతో వాన ఎడాపెడా ముంచెత్తి కురవసాగింది. సత్రవులోకి నీళ్లు కిటికీలోంచి కుండతో కుమ్మరించినట్లు రాసాగాయి. బొగ్గుల కుంపటి ఆరిపోయింది. వల్లి హోల్డాలుమించి దిగువకు క్రమంగా జారిపోయింది. ఆమె అస్తావ్యస్తంగా సగం నేలమీద సగం పెట్టెమీద కొంత శరీరం హోల్డాలుమీద వెల్లకిలా పడివుంది, తెలివి ఏ కోశాన్నా లేదు, కాళ్ళవద్ద కుచ్చెళ్ళు చెదిరి పోయాయి, పవిటచెరగు ఎగిరివచ్చి ముఖం కప్పడిపోయింది. కాని ఆమె వుచ్ఛ్వాసనిశ్వాసాల కదలికలు మాత్రం స్పష్టంగా అక్కడ పోల్చుకోవచ్చు. కాని ఆమె మొలలో గ్రుచ్చుకున్న బత్తాయి చాకుమీద మాత్రం వుంచిన చెయ్యి అల్లానేవుంది.

మోతీ ఆగరాబాదరా లోనికొచ్చాడు. దీపం ఆరిపోలేదు..... మిస్సమ్మ అస్తావ్యస్తంగా వెల్లకిలా చైతన్యరహితంగా నేలమీద పడి

వుంది. ఆ దీపాన్ని కదుపుదామన్నా, ఆ మనిషిని సమీపిద్దామన్నా వచ్చే టంత భయం మోతీ ముఖంలో కనిపిస్తోంది. ఆమె పడగవిచ్చిన త్రాచులా అతడ్ని భయపెట్టింది. ఆ స్థితిలో ఆమెను చూసినప్పుడు అతను చాలా జాలిపడ్డాడు. ఆమెను ముట్టకుండా నీరు చుట్టూతా కాలువలా ప్రవహిస్తోంది. అతను సాహసించి దీపం చేత్తో పుచ్చుకున్నాడు. ఆమె వైపుకు త్రిప్పి ముందుకు వంగాడు. ఆమె వూపిరి కదలికలకు అనుగుణ్యంగా కదుల్తున్న నిమ్నోన్నతాలు సూటిగా దృష్టిలో నిలిచినై, అతని చేతిలో లాంతరు గజగజలాడింది. పట్టు తప్పిపోకుండా నేలను ముడతలు పడ్డ గొంగళిని చేతికర్రతో పైకెత్తాడు. ఇప్పుడు మోతీ కళ్లకు వల్లి పడుకున్న చోటికి నడుమ అడ్డుగా గొంగళీ వ్రేలాడుతోంది. దీప కాంతి ఆమె శరీంమీద ఎక్కడా పడుతున్నట్లు లేదు. మోతీకి నెత్తుటి మడుగులోని పల్లెపడుచు, చెరువులోని శవం భీకరంగా గుర్తుకొచ్చినై. లాంతరు క్రిందకు దింపాడు. ఆ గొంగళీని ఆమెకాపాదమస్తకం కప్పి దూరంగా నిల్చొని చూశాడు. ఈ అనంతకోటి మానవానీకంలో ఒక అమాయిక స్త్రీ తర తరాల్నుంచీ తెలియని దీర్ఘ నిద్రలో మునిగినట్లుగా వున్నది. అంతే. అతడు గబగబా యీవలకు వచ్చి అరుగుమీద కూర్చున్నాడు.

వాన వుధృతంకూడా సడలిచ్చినట్లుంది. గడ్డంక్రింద కర్రనాన్చి ఆలోచిస్తూ శూన్యంలోకి చూస్తూ కూర్చున్నాడు మోతీ.

తెల తెలవార్తోంది.

వల్లి నెమ్మదిగా కదిలింది. ఆమె అరికాళ్ళకు చల్లగా నీరు తగిలింది.... ఒక్కమాటు గుండె ఝల్లుమంది. మీద గరుగ్గా.... బరబర లాడ్తూ బరువుగానున్న గొంగళీ.... వల్లి తోసుకుంటూ లేచి నిలబడింది. ఆమెకు చేతికి ముందుగా మొలలోని బత్తాయి చాకు చల్లగా తగిలింది. ఒక్క విసురున దాన్ని పెరికి చూసుకుంది. ఏముంది ? ఏమీ జరగలేదు ఆశించినట్లు. అంతా ప్రశాంతంగా మామూలుగానే వుందే ? కిటికీలోంచి చూసింది. మోతీ గడ్డం క్రింద చేయిపెట్టుకుని ఆలోచిస్తున్నాడు. అతడి ముఖం వికృతంగాలేదు.

కాని వల్లి ముఖం నల్లగా మాడిపోయింది. ఆమె యెంత ఘోరంగా ఘాతుకంగా ఆలోచించింది! ఆమె కళ్ళు నీటిలో నిండి పోయాయి. ఆ చెంపల్ని వెచ్చగా తడుపుకొంటూ కన్నీరు గుండెలవరకూ స్రవింపసాగింది.

"ఈ ఘాతుకమైన ఆలోచనలతో నేనిదివరకే అపవిత్రమై పోయాను." ఆమె సంఘాన్ని దైవాన్నికూడా మరిచి నడ్డిమీద చేతినాన్చి గొణుక్కుంది. ఈ బాధకన్నా నిస్పృహకన్నా చెరపబడి వుంటేనే బాగుండిపోయేదేమో! నరాలు దిగలాగుతున్నాయి. ఆమె కళ్ళు చెమ్మగిలి చూపానటంలేదు. ఆమె శరీరం యావత్తూ గ్రుడ్డివాడిలా ఆశ్రయం కోసం తడుముక్కాయుతూ తపించిపోతున్నట్లుంది. ఏమీ జరక్కపోవటం చివర కెంతమాత్రం తృప్తికరంగాలేదు. ఆమె ఆశించినట్లు తను ఘోరాతిఘోరంగా శిక్షింపబడి వుండాల్సింది. వల్లి బత్తాయి చాకును దూరంగా గిరాటుపెట్టింది. నడుస్తూంటే ఆమెకాళ్ళక్రింద ఎవరో తిని పారవేసిన మిఠాయి పొట్లాలు బంతిపూల ప్రోగులు పగిలిన గాజులు ఏదో దొరకని జీవితంలో పోగొట్టుకున్న వస్తువుల్ని జ్ఞాపకానికి తెస్తున్నాయి. వల్లి అడుగులో అడుగులు వేసుకుంటూ సత్రవునుదాటి యీవలకువస్తూ అప్రయత్నంగా తను మీసాలమ్మాయినన్న విషయం గుర్తుకు తెచ్చుకోకుండా వుండలేకపోయింది. ఆమె తన్ను తాను అసహ్యించుకుంటూ మోలీకేసి చూసింది,

ఎలుగుబంటిలాంటి మహాకాయం లస సామాన్ను అవలీలగా యెత్తి పట్టుగుని పెద్ద పెద్ద అంగల్ని వేసుకుంటూ బయల్దేరింది.

వల్లి ముందుకు చూసింది. ఎప్పుడూ వుదయించే సూర్యుడే ఆరోజు క్రొత్తగా పుదయించినట్లు తోచింది. వర్షానికి తడిసిన చోటంతా బురదను ఆమె పాదాలమీంచి కుచ్చిళ్ళమీదకు చిందర గొడ్తున్నా-నిర్భయంగా జాలిగా వల్లి యిలా క్షణమాత్రం తలపోసింది—

"తనుకూడా వొక నిట్టాళ్ళ పాకలో వుంటూ-గీరుగారుమనే పసిపిల్లలు కాళ్ళావేళ్ళా పడ్తుంటే-మోతీలాటి నరసజువు అడపా తడపా

నెత్తురు కళ్ళ జూసేలా బాత్తోవుంటే....ఆ గంభీరమైన పర్వతాకారం తన్ను ఆక్రమించుకొని-తన రక్తాన్ని తనలో ప్రవహింప చేసుకోగలిగితే, ఎముకలు చిత్తు చిత్తయినా-నెత్తురు మడుగులైనా....బస్! చాలు ఇంక తనకేం కావాలి?"

వల్లి నెమ్మదిగా ముందుకు చూసింది. సహస్ర హస్తాలతో బాల భానుడు చిరునవ్వులతో [illegible]యాన్ని పరిషేచన చేస్తున్నాడు. వల్లిని మిషనరీల దౌర్భాగ్యపు కోటగోడలు కబంధ హస్తాలనుసాచి ఆహ్వానిస్తున్నై.

ఇద్దరూ ముందూ వెనుకా పాదాలను గ్రుచ్చి గ్రుచ్చి యెత్తి అడుగుల్ని వేస్తున్నారు.

ఇరవై సైరాళ్యపు చలిగుబుళ్ళ వెనుక పన్నెండు శిశిరవసంతాల శైశవం మళ్ళీ ఎల్లావస్తుంది?

ఒకప్పుడు తన్ను....మీసాలమ్మాయనేవారు,

పన్నెండో యేటా....కాదు! కాదు!

అల్లాటి పన్నెండో యేడు మళ్లీ ఎల్లావస్తుంది?

# పరదేశి

ఊళ్ళోకి ఎవరో కొత్త మనిషి వచ్చాడు.

అతను బాగా పొడుగ్గావున్నాడు. ఎంత పొడుగో చెప్పాలంటే-ఆ వూళ్ళో తతిమ్మా జనాభా అంతా తేరిపారి చూడాలంటే వాళ్ల మెడలు కాస్తో కూస్తో నొప్పి పుట్టి తీరాలిసిందే! మనిషి మాత్రం సన్నగా గెడకర్రలా వున్నాడతను. అతను నెత్తిమీంచి టోపీ గనక తీస్తే కోడి గ్రుడ్డులా నిగనిగ లాడ్తున్న అతని బుర్రమీద మచ్చుకన్నా వెంట్రుకలు కాసిని నాలుగు వరకలన్నా లేకపోవటం నవ్వు పుట్టిస్తుంది. కంటి మెడ చొక్కాయి వేసుకున్నాడు. ఆ చొక్కామీదనే మాసిపోయి అట్టలుకట్టిన నెహ్రూకోటు కూడా వుంది. ముడుతలుమీదకి బాగా యెగ్గట్టిన ధోవతీ-అరిగిపోయిన ఎర్రమట్టిరంగు కాన్వాసుజోళ్లు వేసుకుని బుజాన హస్తంత పెద్దసైజు గుడ్డలమూట ముడిలోకి తగుపాటి చొక్కైన నల్లటి పొడుగాటి చేతికర్ర మార్చి, మిటమిటలాడే ఎండలో పెద్ద పెద్ద అంగలు వేసుకొంటూ, వుండి వుండి నూతిలోంచి వస్తూన్నట్లున్న కీచు గొంతుకతో 'సతరంజీ....' అని అరుచుకుంటూ ప్రక్కప్రక్కలకు ఆగి యెవరేనా పిలుస్తున్నా రేమోనని చూసుకుంటూ పోతున్నాడు.

ఒకరకం జనుమునుంచి తీసిన నారపట్టుతో నూలు జోడించి దుప్పట్లలా మామిడి అంచులతో చాలా చక్కగా మన్నికగా వుండేందుకు తయారుచేసిన గోధుమరంగు శాలులను 'సతరంజీ' లని బేహారీలు తెచ్చి గుమ్మంలోయిళ్ళముందు అమ్ముతూంటారు. ఇవి దగ్గరదగ్గరగా బరంపురం పట్టుబట్టలలాగే వుంటాయి. మగవాళ్ళూ ఆడవాళ్ళూ మీదను సుళువుగా శాలువలా కప్పుకు హాయిగా తిరగొచ్చు.

ఈ సతరంజీల మనిషి నిలువుగా మంచి గంధంతో బొట్టు పెట్టుకున్నాడు. వీళ్లకు కాస్తోకూస్తో తెలుగు, ఒరియా, హిందీ, అరవం, బెంగాలీ, మరాఠీ అన్నిభాషలువచ్చేవుంటాయి. దేశద్రిమ్మరులు, ఒకమాటు పిలిచి మూట దింపించామంటే, ఆరు రూపాయలకు యిచ్చేదస్తువును అరవై రూపాయలనుంచి బేరం తగ్గించుకుంటూ చివరకు అంటగట్టిగాని

యింటిముందు నుంచి కదలరు. గంట గంటన్నర బేరంలో-వాళ్ల వారి వారి జీవితాలు కష్టసుఖాలు వారిదేశం స్థితిగతులు మంచీచెడ్డా అంతా మాట్లాడి మన పుట్టుపూర్వోత్తరాలు అన్నీ అడిగి చెప్పిపోతారు.

ఎక్కడో తింటారు. ఏ బజారులోనో సత్రపు అరుగుమీదో రాత్రిళ్ళు కాలక్షేపం చేస్తారు. ఉదయం పోస్టాఫీసు దగ్గర తమ తమ కుటుంబాలకు డబ్బు పంపించే సందర్భంలో- వారి వారి యోగ క్షేమాలు తెల్సుకునేందుకు వుత్తరాల కోసమో గొప్ప ఆతృతతో కూర్చుంటారు. మనియార్డరు ఫారాలు రాసి పెట్టమంటారు. కవర్లమీద చిరునామాలు రాయించుకుంటారు, ఇంగ్లీషు వుత్తరాలు తెచ్చి చదివించు కుంటారు, ఈ తిరుగుబోతుల్ని కదిలిస్తే యెన్ని యెన్ని అద్భుతాలు చిత్ర విచిత్రాలు చెబుతారో అవన్నీ నమ్మేందుకు వీలు లేకపోయినా, ఆశ్చర్యంగా వుండి గొప్ప కాలక్షేపం మాత్రం అవుతుంది.

ఈ పొడుగు మనిషి 'వూళ్లోకి రాగానే అతడికి అంతా 'లంబూ' అని పేరు పెట్టారు. లంబూ-విగ్రహం గ్రామంలోకి వచ్చిన నాటిరాత్రి బజారు సావట్లోంచి మధురాతి మధురమైన మురళీగానం ఆ వూరివారంతా విన్నారు. 'లంబూ' సతరంజీల మూటలో ఒక పిల్లనగ్రోవి కూడా వుండటం ఒకరిద్దరు చూశారు.

కొన్ని కొన్ని వూళ్ళల్లోకి క్రొత్త అనేదియేదీ, దానంతటది హఠాత్తుగా రావటానికి వీల్లేదు. హఠాత్తుగా వచ్చేది యేదన్నా దాన్ని చిలవలూ పలవలూ చేసి చెప్పుకుంటారు.

చుట్టాలు వస్తారు-వెడతారు.

ఎవరింట్లోనో ఓ పాపాయి పుడుతుంది. ఎక్కడో బావి దగ్గర ఫలానా వారింటికి క్రొత్తకోడలు వచ్చిందని అమ్మలక్కలంతా చెప్పుకుంటారు. ఫలానావారి అల్లుడొచ్చాడని చాటుగా యెన్నివంకలు పెట్టినా పదిమందీ పలకరించి మర్యాదగా మాట్లాడుతారు. ఇల్లా జరిగే క్రొత్త క్రొత్త విషయాల్లో ఒక పద్ధతి తరహా అంతావుంది. దేన్నీ అట్టే కాలం క్రొత్తగా వుండనివ్వరు మనుష్యులు.

తోటలు దొడ్లూ-తూముకాలువలు సందులు గొందులు-పాడుపడిన గోడలు రోజూ చూడ్డానికి మామూలు అనుకోడానికెంత అలవాటుపడ్డారో, స్త్రీలు పిల్లలూ, ముసలీ-ముక్కా యీ ముఖాలన్నీ మామూలే అయి పోయాక, ఎక్కడ్నుంచో ఒక క్రొత్త మనిషి వచ్చినప్పుడు, ఆ పరాయి వ్యక్తికళ్ళతో చూసి ఫలానాచోటు సుందరంగా వుందని, ఫలానా వీధి మురుగెత్తిపోతూందని, ఎవరోపిల్లలు అందంగా చలాకీగా దాగా ఆడు కొంటున్నారనీ, స్త్రీలు శుభ్రంగా అలంకరించుకుంటారనీ ఇవన్నీ ఎవరో చెప్పేదాకా మనకు తెలియని పరిస్థితిలో పడిపోతాం. అంతే యేమీ లేదు.

ఒక మంచినిగాని, ఒక అందాన్ని గాని, ఒక గొప్పతనాన్నిగాని యెవరో వచ్చి మనకు చెప్పేవరకూ, అలాటివి కొన్ని మన పరిసరాల్లోనే వున్నాయని మామూలుగా మనుష్యులు కనుక్కోలేరు. ఈ పైనుంచి వచ్చిన శక్తితో మనకళ్ళు విప్పటానికి అన్ని వేళలా అవకాశమివ్వరు. ప్రజలు, ఇందుకు కొంతమృష్ణ వాస్తవంగా కొంత సత్యాన్ని చిత్రహింస పెట్టడం జరుగుతుంది.

ఊళ్లో అంతా మామూలు మనుష్యులే-పోస్టుమాస్టరు-పోస్టాఫీసు, స్కూలు-పంతుళ్ళు, ఒక వుమాపతి డాక్టరు, ఒక మంత్రసాని, పోలీసు స్టేషను, ఎవరో చిన్నచిన్న వృత్తులూ వుద్యోగాలు చేసేవాళ్ళు, కరణమూ మునసబూ, దుకాణాల షావుకార్లు, బడా బడా సేట్లు-రైతులు కూలీలు అంతా వున్నారు. గ్రామానికి తూర్పున చక్కటి వేణుగోపాలస్వామి కోవెల వుంది. కోవెల వెనుక అందమైన తోటవుంది, తోటలో ముచ్చ టైన కోనేరు.-కోనేటి గట్లచుట్టూ మందార మొక్కలు, గన్నేరు చెట్టు పూలతో వంగి, యింకా హాయినిగొలిపే అనేక రకాల పిట్టలూ కోయిలలు పావురాల మధ్య రోజస్తమానమూ పిల్లలు రకరకాల ఆటలు ఆడుకుంటూ పాడుకుంటూ పొద్దులుబుచ్చుతారు.

ఆ కోనేటికి ఆడవాళ్లు తమతమ పిల్లల్ని నడిపించుకుంటూ చంకలో బిందెలతో వచ్చి వుదయం కబుర్లాడుతూ కష్టసుఖాలు చెప్పు కుంటూ స్నానాలుచేసి ఒయ్యారంగా ఇళ్లకు వెళ్ళిపోతూంటారు.

అల్లాటిగి భాగల్పూరునుంచి చొకాల్ల లానులు దుప్పట్లు బుజాన్నేసుకుని వీధి వీధి తిరిగిన 'లంబూ'కి ఆ గ్రామం చాలా చిత్రంగా వున్నట్లు తోచింది. సాధారణంగా 'లంబూ' వీధిలో తిరుగుతూంటే పిల్లలు గుంపులు గుంపులుగా వెంబడించి కేకలు వేస్తూ అల్లరి చేస్తూ విసిగించేవారు. సాయంత్రాలు చీకటిపడ్డాక ఎక్కడ పడితే అక్కడ పిల్లల్ని దారి అటకాయించి ముంశివాయించమని పీకేసేవారు. ఆట్లాటి దిప్పుడా వూళ్ళో రోజల్లా వీధివీధి తిరిగినా మచ్చుకన్నా ఒక చిన్నపిల్ల వీధిలోకి రావడం కనపడలేదు. మొత్తం వూళ్లో ఎవరికీ పిల్లలున్నట్లేలేదు. పిల్లలు లేకుండా వున్నవూరు ఎంతలందంగా గొప్పగావున్నా అక్కడ నిల్చోటానికకూడా లంబూకి మనసు పప్పటంలేదు, కొనేటిదగ్గర ఆడవాళ్ల ముఖాలో భయం దోబూచు లాడుతోంది- ఎవరికీ వూళ్లో పిల్లలు లేరనటానికి వీల్లేదు. అస్సలట్లా పిల్లలు లేకుండా వున్నవూరు ఎక్కడన్నా వుండగలగటం అసంభవం! పోతే అంతా తమతమ పిల్లల్ని యిళ్లలో దాచేసుకుసన్నా వుండాలి-ఎక్కడో గదుల్లో కదలకుండా కట్టిపడేసన్నా వుంచాలి.

'లంబూ' మనుష్యులందర్నీ చాలా జాగ్రత్తగా తేరిపారచూసి-కనుక్కున్నాడు. అందరిముఖాల్లోనూ 'భయం-సందేహం-అనుమానం' యీ లక్షణాలు చీకటితెరల్లా దింపుకొనున్నాయ్.

ఎవరింటిముందన్నా ఆగి సతరంజీలు అందీలు కావాలా అని తనుఅడిగినప్పుడల్లా, వాళ్ళ ముఖాలు మీదకు విరుచుకుపడే పెద్దపులుల్లా చీల్చుకు తినటానికి సిద్ధంగా వున్నట్లున్నాయి.

ఈ గ్రామానికి ఏదో పెద్ద ఆపత్తు వచ్చింది - పాపం మనుష్యులంతా భయాందోళనల్లోపడి కొట్టుకొంటున్నారు. పిల్లల్ని ఎక్కడా కనబడ నియ్యటంలేదు. కారణం యేమైవుంటుందా అని లంబూ దీర్ఘంగా ఆలోచనలో పడ్డాడు.

ఆరోజు జరిగిన సంగతులన్నీ గుది గుచ్చినా లంబూకి తలా తోకా అంతు చిక్కటంలేదు,

మధ్యాహ్నం ఎవరింట్లోనో ఒక పద్దెనిమిదేళ్ళ అమ్మాయి నాలు గేళ్ళ కుర్రాడిని వ్రేలుపుచ్చుకుని గుమ్మంలో నిలబడి వీధిలోకి చూస్తూం డగా తను దాహంవేసి మంచినీళ్లు అడిగాడు,

ఆ అమ్మాయికెవ్వుమని బిగ్గరగాఅరచి తలుపు దభాల్నవేసుకుంది. కోనేటి దగ్గర గన్నేరు చెట్టు నీడలో తను సత్తుపింగిలో పచ్చి మిరప కాయలూ, నీళ్ళూ పోసుకుని పిసుక్కొని నాలుగుముద్దలు నోట్లో వేసు కున్నాడో లేదో, దాహంవేసి కోనేటి మెట్లవద్దకు నీళ్ళకోసం పోయి వంగుంటే - మెట్ల మీంచి తడిబట్టల్తో బిందె నెత్తిన పెట్టుకుని వస్తూన్న ఆవిడెవరో ఘటాన్ని మెట్లమీదయెత్తేసి కంగారుగా దవుడు తీసింది. కొలనులో స్నానం చేస్తున్న యిల్లాలు గాభరా యెత్తిపోయి బుడుంగు బుడుంగున మునకలేస్తూ నీళ్లు గుటగుట ద్రాగేస్తోంది,

నిజంగా వీళ్ళంతా కొత్తమనిషినిచూసి జడుసుకుంటున్నట్లున్నారు. 'లంబూ' చాలావిచారించాడు. నిజంగా తను చాలా పొడుగ్గా వుండటం వల్ల యీ వూళ్ళో అంతా తన్ను అనుమానంతో, సందేహంతో, భయంతో చూస్తున్నట్లున్నారు. తన దగ్గర మూటలో ఒకకత్తెరా గజం బద్దా, పిల్లనిగ్రోవీ తప్ప మరే ప్రమాదకరమైన ఆయుధమూ, వస్తువా వున్నట్లులేదు,

సంతపాకల్లో రాత్రి ఆతడికి ఎంత బలవంతాన రప్పించుకుందా మన్నా కంటికి కునుకే పట్టలేదు. తల్లక్రింద పక్షులు చీకట్లో రెక్కలు టప టపా కొట్టుకొంటూ సంచారంచేస్తున్నాయి. గాలి విసురుగా వీచి నప్పుడల్లా చలికి ముడుచుకొని కంబానికి జారగిలబడ్డ 'లంబూ' మీద సంతపాకల్లో మీదనుండి తరతరాలనాటి బూజు మన్ను పెంకులు వుండి వుండి రాల్తూ విశ్రాంతిని భంగంచేస్తున్నాయి.

మీదను మినుకుమినుకుమనే నక్షత్రాల్ని చూస్తూ 'లంబూ' పిల్లన గ్రోవితీసి వాయించసాగాడు. రోడ్డుమీద కల్లుపాకనుంచి అమృతం పుచ్చుకున్న దేవతలు దొర్లుకుంటూ, వూగులాడుకుంటూ, బిగ్గరగా కేకలుపెడ్తూ జట్లుజట్లుగా చీకట్లో కలిసిపోతున్నారు. గాఢాంధకారంలో

చెట్టుమీద రెక్కల్ని కప్పుకుని గూళ్ళలో కన్నుమలిపిన నానాపక్షి సంతానమూ, 'లంబూ' మురళీ నాదాన్ని వింటూ, మెచ్చుకుంటూ హర్ష ధ్వానాలు చేశాయి.

ఆ వూళ్ళో ఒక పచ్చి కసాయి, కరకు పొగరుమోతు పరమ దుర్మార్గుడైన మనిషి ఒకడున్నాడు. అతగాడికి చాలా పెద్ద మీసాలు, గ్రుడ్లు, భీకరమైన బొజ్జ - చూడ్డానికి ఘటోత్కచుడికి మల్లేనే వుంటాడు. పగలు చూస్తే రాత్రి కల్లోకొస్తాడు. పిల్లలువాడిని చూస్తే జడుసుకుని పాలైనా త్రాగరు. అతగాడు అస్తమానం రాత్రిళ్ళు నిశాచరుడిలా వూరంతా తిరుగుతూ బాటసారుల్ని - కొత్తమనుష్యుల్ని హడలుగొట్టి పీడించుక తింటూ వుంటాడు, ఈ పెద్దమనిషికూడా అమృతం సేవించి దొర్లుకుంటూ, దొర్లుకుంటూ పిల్లనగ్రోవి పాటనుబట్టి సంత వసారాలో కొచ్చి అక్కడ గడకర్రలాటి 'లంబూ'ని పసిగట్టి - వూరికే పాదం చరుస్తూ బుసలు కొట్టడం ఆరంభించాడు.

'లంబూ' మురళి వాయించటం ఆపి - 'ఎవరక్కడ భయ్యా' - అని అడిగాడు.

'దేవతలం మేం - అమృతం తాగొచ్చాం. ఇక్కడ గెడకర్ర లాటి దేమో మెసుల్తూ వుంటే కాస్త సరిజేద్దామనిపించింది మాకు.' 'లంబూ నవ్వాడు.

'ఈ గట్టుమీదకు వచ్చి కూర్చో అన్నయ్యా, అమృతం చెవుల్లో కురిపిస్తాను. ఈ చీకట్లో నీ హృదయం గట్లు త్రెంచుకుని పరుగెడ్తుంది' అని మళ్ళీ పిల్లనగ్రోవిని పెదిమలకు తాటించాడు.

'ఏంటో వాగుతాడు - బద్మాష్! నీలాటి ముండాకొడుకుల్ని యీ స్తంభాలకేసి రెక్కలు విరిచి కట్టెయ్యాలి. ఊళ్లోంచి కదలి పోనివ్వ కూడదు' ఇంకా బుసలుకొడుతూనే వున్నాడు.

పాట హెచ్చుస్థాయిలో తరంగాలు తరంగాలుగా నాలుగుదిక్కులూ చుట్టుముట్తోంది.

లంబూకు వినిపించేలా - 'నేను నాగుబాములాటివాడ్ని -' వికటంగా బిగ్గరగా నవ్వాడు పాట ఆపేసి లంబూ.—

'ఇది తెలుసా - యిది మ్రోయిస్తే పన్నగాలచేత విషం కక్కించి తీరుతుంది'.

హఠాత్తుగా ఆ వ్యక్తి 'లంబూ' చేతిలోని మురళినిలాక్కుని నోటిదగ్గర పెట్టుకుని వికృతంగా ధ్వనులు చేస్తూ చీకట్లోకి పరుగెత్తాడు.

లంబూచేతు లెత్తి బిగ్గరగా అన్నా - అన్నా అది నీకు ఎందుకూ పనికిరాదే. రా! రా ! యిచ్చెయ్యన్నా - నా ప్రాణం....నా సర్వస్వం —! గొంతుక జీరపడిపోయింది. లంబూకి చాలా కోపంవచ్చింది. బజారు సావిట్లో నిలబడి చేతులెత్తి శాపనార్థాలు పెట్టడం సాగించాడు ఆ దుర్మార్గుడి పెంకె తనానికి. లాక్కున్న పిల్లనగ్రోవిని వికృతంగా వూదుతూ, ఆ పొగరుబోతు ఒక సందులో, సన్నటి దీపంవద్ద పాను దుకాణంలో, ఆకుపచ్చ చీర, ఎర్రగా తమలపాకులు నమిలి నమిలిన గారపెదవులు, మెడనిండా పచ్చ బంగారంతో కూర్చున్న స్త్రీ వద్దకు వచ్చి నిలబడి గొప్ప ఘనకార్యం చేసిన వాడిలా ముసిముసి నవ్వులు ఆరంభించాడు.

'అదేవిటోయ్ - మురళి-'

'ఎత్తు కొచ్చాను.'

'అల్లా వికృతంగా వస్తున్నాయే ధ్వనులు'-

'ఇందాకటి దాకా బాగానేవుందిమరి. ఆ ముండాకొడుకు చేతి లోంచి లాక్కున్నాక నువ్వన్నట్లే కర్ణకఠోరంగా వస్తున్నాయి ధ్వనులు.'

'తెలిసిందా ?'

'ఏవిటి ?'

'నువ్వు దుర్మార్గపు మనిషిని-అల్లాటి మధురమైన వాద్యాలు ఎంతో సున్నితమైన మనస్సు గలవాళ్ళ వాయిస్తేనే పలుకుతాయి. అవన్నీ

మంచివాళ్ల చేపట్టాలి-నీకోటి ఉచ్చాలు ముట్టుకుంటే కఠోరమైన శబ్దాలే వస్తాయి.'

'నిజంగా ....'

ఆ కరోడా మనిషి ఎంతో ఎత్తునుంచి దభాలున కూలపడినట్లు అయిపోయి, యిక అక్కడ ఆగకుండా లంబూపరున్న బజారు పాకల వద్దకు రొప్పుకుంటూవచ్చి-దానితో కోడి గ్రుడ్డులాటి లంబూ నున్నటి తలమీద 'తమ్ముడూ-తమ్ముడూ' అంటూ వాయించాడు.

లంబూ లేచికూర్చున్నాక—

'తమ్ముడూ-అమృతం నేనులాగినా దేవతవి నువ్వే. నువ్వు ఎంతో మంచి వాడివి కాబట్టి నువ్వు వాయించినప్పుడే అమృతం చెవుల్లో కురుస్తుంది. పాడు భాయ్!

లంబూ నిశ్శబ్దంగా చాలాసేపు వాయించాక-నెమ్మదిగా 'అన్నా-యీవూళ్లో పొద్దుయంనుంచీ ఎక్కడా పిల్లా జెల్లాతిరుగుతూవున్నట్లులేదు' అని తన అనుమానాలూ, జరిగినవీ పూసగ్రుచ్చినట్లు చెప్పాక-కరోడా గంభీరంగా యిలా అన్నాడు :

ఇక్కడ పిల్లల్ని ఎత్తుకుపోతున్నారనే వదంతి వచ్చిపడింది. భాయీ! ఎత్తుకపోయి ఎక్కడో మామ్మాయి పంచుతున్నారట. పిల్లల్ని ఇళ్లల్లోంచి బైటకు రానివ్వటంలేదు. క్రొత్త వాళ్లనిచూసి భయపడుతున్నారు. ఊరంతా భయభ్రాంతులై వున్నారు. ఎవరూ దేన్నీనమ్మటంలేదు!

లంబూ 'అరె-బాప్రే-' అని అరిచి-అదంతా నిజమంటావా భాయ్? పిల్లల్ని యెవరేనా ఎత్తుకపోయి వండుకుంటారా-ఇల్లాటి పిరికిమందుపెడ్తే జనం మరీ పుంజాలు తెంపుకుంటారు. నాకు నమ్మకం చాలటంలేదప్పా— 'కరోడా' చాలా రాత్రివరకూ పిచ్చా పాటీ చెప్పి 'లంబూ'ని స్నేహితుడ్ని చేసుకుని కాస్సేపు పోగిడి చీకట్లో మాయమై పోయాడు. అమర్నాడు అనుకోకుండా ఒక చిత్రమైన సంఘటన జరిగింది. సాయంత్రం

లంబూ-బుజాన్న బట్టలమూటను వేసుకుని వీధివీధులా అమ్ముకుంటూ కేకలేస్తూ తిరుగుతున్నాడు.

అప్పుడొక సందులో నిర్మానుష్య మైనచోట ఒక నాలుగేళ్ళ కుర్రాడు గుక్కబట్టి బిగ్గరగా యేడుస్తున్నాడు. చుట్టుపక్కల ఎక్కడా జనసంచారంలేదు. ఇళ్ళుకూడా లేవు. పాపం ఎవరో పిల్లాడు తప్పిపోయి యేడుస్తున్నాడు. లంబూ జాలిపడ్డాడు. ఆపిల్లణ్ని దగ్గరకు తీసుకుని శతవిధాల బుజ్జగించాడు. వాడికి మాటలుకూడా చెప్పటంరావు. గుక్క తిప్పుకోకుండా యేడుస్తున్నాడు. తినడానికి యేమన్నా యిద్దామన్నా లంబూదగ్గర యేమీ పిల్లలకు పెట్టే మిఠాయిలాటి వస్తువులేదు. ఆపిల్లణ్ని ఎత్తుకుని తూముకాలువ వంతెనమీద కూర్చోపెట్టి అమ్మా-నాన్నా ఎక్కడో చెప్పమనీ లంబూ బతిమాలాడు. వాడు కాళ్లు టపటపా నేలను బాదుతున్నాడేగాని యేమీ వినిపించుకోటంలేదు. పొట్ట పగిలి పోతుందేమో నని భయం పట్టుకుంది లంబూకు. ఆలోచించి మురళి పైకి తీశాడు. నెమ్మదిగా ఎదురుగుండా చతికిలబడి వాయిస్తూ కూర్చున్నాడు. పిల్లవాడు యేడుపుమానేసి నవ్వుతూ తప్పట్లుతరుస్తూ గెంతుతున్నాడు.

ఈ రసకందాయపట్టులో యెక్కడున్నారో గెద్దల్లాగవచ్చి వాలారు అరడజనుమంది మనుష్యులు. వాళ్ళు వచ్చీరావటం 'లంబూ'ని ఎడరెక్కా పెడరెక్కా విరిచి పట్టుకున్నారు. పిల్లవాణ్ని మరొకరు ఎత్తుకున్నారు. తతిమ్మా ముగ్గురూ బడితెపూజ ఆరంభించారు.

'దొంగకాడు-పిల్లణ్ని ఎత్తుకు పోతున్నాడు మోసం చేసి.'

'చంపండి! నరకండి! చెట్టుకు కట్టేసి-కాళ్ళ క్రిందనించి మంటలు పెట్టండి. శిశు హంతకుల్ని ముక్కలు ముక్కలు క్రింద కోసి కాకులకూ గ్రద్దలకూ పారెయ్యాలి.'

జనం శివమెత్తిపోయివున్నారు.

'లంబూ' మూటను చిందరవందర చేసిపారేశారు. బుర్ర చితక పొడిచాక ముఖం పగిలి నెత్తురు వోడుతున్నా-లంబూ-

'బాబోయ్-నేను పిల్లల్ని యెత్తుకు పోయేవాడ్ని కాను' అని ఎంత మొత్తుగున్నా యెవరూ చెవిని పెట్టటం లేదు.

అల్లా దారిపొడుగులా తన్ను కుంటూ రోడ్డుమీద యీడుస్తూ జనమంతా లంబూను తీసిగెళ్ళి-బాదం చెట్టు మొదట్లో పగ్గాలువేసి చెట్టుకు ఏసుక్రీస్తును శిలువవేసినట్లు కట్టారు. వంటినిండా గాయాలు-బాదంచెట్టు నిండా కండచీమలు దారులుతీర్చి పాకుతున్నాయి. లంబూ మొర్రో మొర్రో మంటూ భీకరంగా అరుస్తున్నాడు. చుట్టూ జనం నిలబడి పందులు వేసుగుని కాపలా గాస్తున్నారు.

ఈ శిశుహంతకుడ్ని చూడ్డానికి ఆపూరిజనం తండోపతండాలుగా రాసాగారు. తెల్లవారక్కర్లేదు. తెల్లవారకుండానే ఆ చీమలు 'లంబూ'ని మట్టుపెట్టవచ్చు.

ఈ భీకరమైన సన్నివేశం మధ్యలో కరోడా ఆకాశాన్నుంచి వూడిపడ్డట్లు వచ్చి - 'విప్పండి - కట్లు! విప్పులారా - లేదా? లంబూని చంపకండి. లంబూని చంపారో మీయిళ్ళల్లోదూరి మిమ్మల్ని వొక్కొక్కళ్ళని హతమారుస్తాను' అని సింహంలా గర్జించాడు. జనం ఎదురు తిరిగి వివరంగా జరిగినదంతా పూసగ్రుచ్చినట్లు చెప్పారు!

కరోడా యెవరు యెంత అడ్డుచెప్పినా వినిపించుకోకుండా 'లంబూ'ని బాదంచెట్టునుంచి పగ్గాలు కోసి విడిపించి - 'తమ్ముడూ నువ్వు పిల్లల్ని యెత్తుకుపోలేవు, ఈ వూరు వూరంతా నీకు అత్యాచారం చేసింది. ఇదుగో నీబట్టలమూట పోలేపోయింది. నీ మురళి.........యిది. పాడు కుంటూ నీ యిల్లు, నీదేశం, నీపిల్లలు, నీ యిల్లాలు అంతా యెక్కడున్నారో అక్కడికి వెళ్లు. నిన్ను క్షమించమనిఅడగటానికి యీ గ్రామానికి హక్కులేదు, ఐనా నువ్వు మంచివాడివి. ఈ చీమలు నీ గాయాల్ని పొడుచుకుతిన్నా నీ కెవరికీ యే అపకారమూ చెయ్యలేవు. తమ్ముడూ వెళ్ళిపో—'

అందరూ చూస్తూండగా లంబూ మురళిని ఎత్తుకుని యీడ్చుకుంటూ చీకట్లో తన మార్గం వెతుక్కుంటూ వెళ్ళిపోయాడు.

కరోడా జుత్తు పీక్కుంటూ అరుస్తున్నాడు.

'నిన్న మీరంతా అతడి పిల్లనగ్రోవి వాయిద్యాన్ని తనివితీరా విన్నారు. ఎంత మాధుర్యం - ఎంత మంచి మనస్సు, ఎంత సుకుమార మైన ఆలోచనలు, ఎంత రసమయమైన గానం - అంత గొప్ప సంగీత వాద్య శక్తికల మనిషి యిల్లాటి పిల్లల్ని యెత్తుకొనిపోయి వండుకు తింటాడని మీరెట్లా అపోహపడ్డారు? మీపిల్లాడ్ని యేడుస్తూంటే తన మురళీ వాద్యంతో వూరుకోబెట్టి ఆడించాడు. గొప్పకళారాధకుడు శిశుహంతకు డెల్లా అవుతాడు. 'ఓ బుద్ధిలేని దౌర్భాగ్యుల్లారా.... మీరంతా....చేతులారా....ఎంత చిత్రహింస బెట్టారు? ఇదా పరదేశుల్ని ఆదరించే తీరు.... !

రొప్పి రొప్పి కరోడా చాపచుట్టలా దీనినిచెప్పి నేలమీద వాలిపోయాడు. ఎప్పటిలా చీకటి గ్రామాన్ని చుట్టుముట్టేసింది. ఎప్పటిలాగే నక్షత్రాలు మినుకు మినుకు లాడేయి. దేవతలు అమృతం లాగొచ్చి వీధుల్లో తచ్చనాలాడుతూనే వున్నారు.

ఆ చీకట్లో పరదేశీ - పిల్లనగ్రోవీ సతరంజీల కేక - మళ్ళీ ఆ వూరి వాళ్ళు విననోచుకోలేదు. నెత్తురోడుతూన్న దేహభారంతో కుంటు కుంటూ కాళ్ళీడ్చుకుంటూ 'లంబూ' ఆ చీకట్లో తన మార్గం ఎట్లా వెతుక్కున్నాడో - యింకా ఎన్ని సందేహాలు, అనుమానాలు అవమానాలకు గురి అయ్యాడో చెప్పటం కష్టం.

ఒక గొప్ప కళారాధకుడు, ఒక చిత్రకారుడు, ఒకకవి, గాయకుడు చచ్చురకం నేరస్థుడు కావటం అసంభవమని చెప్పాలను కుంటాడు కరోడా.'

కాని చెప్పడానికి కావలసిన సంస్కారం, మాటలు, మార్గం మాత్రం అతగాడికి పట్టుపడలేదు నాటినుండి నేటివరకూ.

# అనవసరపు దాంపత్యం

ఉక్కిరిబిక్కిరైన ఆశయాల సూట్‌కేసుతో "శ్రీహరి" హౌరా స్టేషనులో దిగినప్పుడు. చీమలబారులా యిటూ అటూ అన్ని వైపులకు బస్సులు పరుగు లెత్తటం చూసినప్పుడు, ప్రపంచంలోని అన్నిజాతుల మనుష్యులతో కిక్కిరిసి పోయిన ఆ మహానగరానికి గుండెల్లోంచి చల్లగా ప్రశాంతంగా సూర్యుడి బంగారు హస్తాల తాకిడికి తేలిపోతూ మిలమిలా మెరిసిపోతూ స్వచ్ఛమై పావనమై కదిలి పోతున్న గంగానది (హుగ్లి)ని చూసినప్పుడు-యిది నాదేశం, యిది నా సౌభాగ్యం అని పుప్పొంగిపోయి గుండెల్లో యేదో నిండుగా ప్రవహించి కళ్ళలో యేవో క్రొత్త వెలుగులొచ్చి తీవిగా నడచిన శ్రీహరి-గార్డెన్‌రీచ్ ఆఫీసులచుట్టూ ప్రదక్షిణాలు కొట్టి కొట్టి, యింతై నలుసంతై చెల్లని రికమండేషను పత్రాల ద్రోహానికి వొళ్ళు మండి పళ్ళుపిండి, బఠాణీలుతిని మంచినీళ్లు త్రాగి స్టేషన్ బెంచీలమీద పడి రాత్రిని నమలబోయి, పోలీసుల పేంబెత్తాల చురకలు తిని, వ్యవస్థను తిడ్తో అవస్థలు పడ్తో, ట్రంకుపెట్టి మోసుగుంటూ మోసుకుంటూ-వుదయం మనుష్యుల్ని చీల్చుకుంటూ సాయంత్రం జీవచ్ఛవాల్ని వదలివేసే "కలకత్తా జనపనార పొగ గొట్టాల" ఆహ్వానాన్ని స్వీకరించి కలిసిపోయాడు దేశాన్ని తిట్టుగుంటూ.

కిక్కిరిసి వుక్కిరి బిక్కిరైన సూటుకేసులోంచి ఆడది, పెళ్ళి, విద్య, వున్నతోద్యోగాలులాటి ఆదర్శాలను పెరికి యీవల గిరాటుపెట్టి హాయిగా పొగగొట్టంలోకి దూరాడు మనిషి. తెనుగుదేశంలో జనపనార గొట్టాలు లేవు-కోచ్ ఫ్యాక్టరీలేదు సరిగదా సిగరెట్ ఫ్యాక్టరీ అన్నాలేదు. పదిమందికి వుపాధిని కల్పించే ఆస్కారం యేదన్నా యేర్పడితే అది తెనుగుదేశపు పొలిమేరల్లోలేదు. తెనుగు దేశంలో బట్టలమిల్లులు లేవు-బట్టతలలున్నాయి. చదువుకుని ఉద్యోగాలు దొరక్క అనటం కన్నా పెళ్ళాడి సంసారాలకి భయపడి దేశం విడిచిపోయిన తెనుగువాళ్ళంతా కూలీలు గుమాస్తాలు....రోడ్లు రవాణాలు బాగులేవు. గ్రామాల్లో విద్యు

చ్ఛక్తి లేదు. పరిశ్రమలు లేవు. భారీ యెత్తున నిరుద్యోగ సమస్యను పరిష్కరించగలిగే ప్రయోజనమేదీ తెలుగుదేశంలో ఒనపబడ్డానికి ప్రయత్నాలు లేవు. తీవ్రమైన రాజకీయ చైతన్యం ఆందోళన ఆవేశాలు సంహరించుకోవడాలు వుపసంహరించుకోవడాలు, ముర్దాబాద్ జిందాబాద్‌లు. పోతే కళ్ళజోడు పైజమా లాల్చీ వేసుకునే ప్రతి వ్యక్తీ కవో రచయితో రాజకీయవేత్తో పోల్చుకోవడం దుస్తరంగా వుంది. పిల్లులు ఎలకలు పందికొక్కుల్లాటి మనుష్యుల్తో నిండిపోయిన దేశంలోని చీకటి మనుష్యుల్ని మెడబట్టుకు బైటికి తరుముతోంది.

వీరేశలింగం, గురజాడ, రాజారామ మోహన, గాంధీలు వచ్చాక భూమి బరువెక్కింది. గాలి తేలికపడింది, సంస్కార బీజాలు యువకుల హృదయాల్లోపడి మార్పుకి అనువైన మానసిక వాతావరణాన్ని కల్పించుకుంటున్నై! మనుష్యులు మారుతున్నారు. జీవితాన్ని మార్చుకుంటున్నారు.

మార్పు సంస్కరణలపట్ల కొంతసానుభూతి ఏర్పడ్డం జరిగాక కటకటాలు తెచ్చుకుంటున్నాయి. గోడల్ని కూల్చడం జరుగుతోంది. బానిసతనం హింస అక్రమాలు అన్యాయాలు వోర్చలేమంటున్నారు. స్త్రీల జీవితసమస్యలపట్ల దృక్పథాలు మార్చుకుంటున్నారు....కొంతసానుభూతికి చోటు మిగిలింది....యువకుల హృదయాల్లో పరివర్తన తెచ్చినది, యేర్పడ్డ జాలి, పతితలు పీడితులు అనాథలైన స్త్రీల సమస్యలను కోరి జోక్యం కలగజేసుకోవటమో, సంపూర్ణ మానవహృదయంలో సమస్యా పరిష్కారానికి పోబోయి నిర్వహణలో కోరి కథానాయకుడు కావటమో పరిణామంగా జీవితాల్తో ప్రయోగాల్ని జరిపి విషాదాంత ప్రణయగాథల్ని సృష్టించడమో- జరుగుతూ వస్తోంది!

శ్రీహరి గదికోసం గాలించటం ఆరంభించాడు. కలకత్తా మహా నగరంలో-ఈ తపస్సు చాలా నిష్ఠతో చేశాక - చేశాక కొన్నాళ్ళకు షాలిమీర్‌లో ఏదోగది ఖాళీ అవొచ్చునని చూచాయగా తెలిసింది. రెక్కలు కట్టుకునివాలాడు, బొంబాయిలో దేన్ని పగిడీ అంటార్తో అదే

సలామీ అనే పేరిట చెలామణీ అవుతోంది కలకత్తాలో. ఇంటియజమాని మొట్టమొదట అద్దెకి వచ్చిన వ్యక్తివద్ద రెండు మూడు నాలుగు వందలు సౌకర్యాన్నిబట్టి యింటినిబట్టి పుచ్చుకుని అద్దెకిస్తాడు. నెలసరి అద్దె యాభై యనభై మామూలే-మళ్ళీ అతను ఆ వాటా ఖాళీ చేసేటప్పుడు తనకు తను చెల్లించిన "సలామీ" యిచ్చినవారికే కొంపవశపరుస్తాడు. శ్రీ హరి తను చెల్లించవలసిన సలామీ రెండు వందలని తెలిశాక బుద్ధి సూక్ష్మాన్నిచేసి, పంచేంద్రియాల్ని కేంద్రీకరించి యింటిచుట్టూ పది సార్లు ప్రదక్షిణాల్ని పూర్తిచేసి పదకొండో పర్యాయం ధైర్యంగా లోనికి జొరబడ్డాడు. ఆ ఫ్లాట్ (Flat) కి ఆరు అంతస్థులు-ఆరవ అంతస్థులోచివరగది-అంతస్థుకు ముప్పైగదులు. ఆ భవంతిలో నూట యనభై గదులు-నూటయనభై య్యోగది ఖాళీగావచ్చునని తెలిసింది. అద్దెతక్కువ పైకి చేరసకొద్దీ నిశ్శబ్దంగా ప్రశాంతంగా వుంటుంది, దోరున ఏడవ్వొచ్చు. జీవితం విసుగైతే ఆ పైనుంచి దూకి సులువుగా ప్రాణం తీసుకోవచ్చు. ఇన్ని సౌకర్యాలుండబట్టే రెండువందల రూపాయల సలామీకి తను వొప్పుకుంటున్నది.

శ్రీహరి దగ్గర రెండు వందల రూపాయలు కాదుగదా రెండు రూకలన్నాలేవు. దర్వానుకి "చా" పోసి "పాను" నోట్లో కుక్కి లిఫ్టుమీదుగా సౌధోపరితలానికి చేరుకోగలిగాడు.

సాయంత్రం పల్చగా నవ్వుకొంటోంది. కాంతి మందగిస్తున్నది. దూరంగా కిక్కిరిసిన మహాసౌధాల సందిట్లోంచి నల్లగా మెలికలు తిరిగి పారుతున్నది "హుగ్లి"....నదిలో నీళ్ళలావీధుల్లోమనుష్యులు, వాహనాలు ప్రవహిస్తున్నాయి....ఎత్తునుంచి సాయంత్రం చీకటి పడేవేళ ఆ మహా నగరాన్ని చూస్తే దీపాల వెల్తుర్లో నాటిమనోహరమైన దీపావళీ శోభలు వెల్లి విరియ వచ్చు.

కత్తిపీట ముందేసుకొని చేపల్ని పొలుసు లూడదీసి తరుగుతున్నది ఎవరో బెంగాలీ భామిని. పిల్లలు కోడిపిల్లల్లా తల్లి చుట్టూ పాకురుతున్నారు. ఖస్సుమని దగ్గు తెరలో వుక్కిరిబిక్కిరైన రెండు కళ్లు....గొట్టాం

గ్రాంఫోనుమీద డ్యాన్సుట్యూను వేసుకుని నృత్యం నేర్చుకుంటున్న అడుగుల చప్పుడు మువ్వల మ్రోత....కిటికీలకు కట్టిన చీరలు చిన్న చిన్న చౌక్కాలు బసీన్లూ గాలి పోసుకుని యధేచ్ఛగా పైకి ఎగుర్తున్నాయి. కాళ్ళు జాచుకుని చంటి పిల్లడ్ని బోర్లా జోకొడ్తూ ఆలో చించుకుంటున్న తల్లి....శుభ్రమైన తెల్లని యిస్త్రీ మడతల్లో నలిగీ నలగని యవ్వనంలో ఒకరి కళ్ళల్లోకి ఒకరు తృప్తిగా చూసుకుంటూ ముసిముసి నవ్వుల్ని విరజిమ్ముకుంటున్న యువతీయువకుల జంట. వీట్లన్నిటనీ గడిచి దర్వాను మూట యెనభయ్యోగది వద్దకు శ్రీహరినిచేర్చి వెనక్కు మళ్ళాడు,

ముక్కాలి పీటమీద కూర్చుని విరబోసుకున్న జుట్టుని దువ్వెనతో దిక్కుడీసుకుంటున్న స్త్రీ వీపుమీద ముదురు రంగు ఎరుపు నలుపు చుక్కల పవిట చెరగును ఎడమచేత్తో లాక్కుంటూ లేచి నిల్చొని తెలతెలబోయి చూసింది. చలిగాలి కెరటంగా తరుము కొస్తున్నది. చీకటి మసగ మసగ్గా వుంది, ఈ గది మీరెప్పుడు కాళీచేస్తున్నారు? సలమీ విషయం మాట్లాడు కుందుకు వచ్చానని చెప్పడానికి శ్రీహరి వచ్చీరాని హిందీ వంగభాషల కలగా పులగంలో విఫలయత్నం చేశాడు. ఆమె చేత్తో స్విచ్చినొక్కివచ్చి ముక్కాలి పీటనుముందుకు త్రోసి 'తెలుగులో మాట్లాడండి బాబూ మీకు పుణ్యముంటుంది.' అని మసగ లోకి వెళ్లి పిట్టగోడ కానుకుని వీధిలోకి ముఖం తిప్పుకుంది.

శ్రీహరి అమాంతం కూలబడి 'మీ....రు....మీరు....తెలుగు.... వా....రా' అని ఆశ్చర్యాన్ని మ్రింగుతూ "చాలా సంతోషం....సం.... తో.షం.." అని పరిసరాన్ని సమీక్షిస్తూ "మీరు ఖాళీ చేస్తున్నారా ... సలామీ విషయం అడగొచ్చా...."

వెల్తురుకి దూరంగా వెళ్ళిపోయిన ఆమె ముఖాన్ని కనబడ్చనీకుండా 'అవును' అంది.

"నాపేరు శ్రీహరి....మాది ఫలానా....జనపనార మిల్లులో పని. తల దాచుకుందుకు ఎక్కడా చోటులేక నానా అగచాట్లూ పడ్తున్నాను.

ఈ గది ఖాళీ అవుతుందని తెలిసిందిగాని మీరు తెలుగువారు కావటం అదృష్టం-" వుత్సాహంగా మాట్లాడ్డాని కుపక్రమించాడు.

చీకట్లోకి తొలగిన ఆమె నిండుగా చెరగును మీదకు లాక్కుంది.

"ఈ గది ఖాళీచేసి మీరు ఎక్కడకు వెళ్తున్నారు? ఎక్కడ్నించి వచ్చారు? ఎప్పుడు ఖాళీ చేస్తారు? సలామీ విషయం తేల్చుగుందుకు మీతో మాట్లాడితే సరిపోతుందా....ఎవరైనా పెద్దవాళ్ళు వున్నారా?"

ఆవిడ నిల్చుని ముఖం ప్రక్కకు త్రిప్పుకొని వెక్కివెక్కి యేడువ నారంభించింది. తన ప్రశ్నలే ఆమెను యేడ్పించాయని అనుకోలేని శ్రీహరి ముక్కాలిపీట మీద చిత్రప్రతిమలా గదిలోకిచూస్తూ వుండిపోయాడు. గదిలోని కిటికీ మూసివుంది. వంకీల్నా తలుపుల్ని మూసిన చీరలు వ్రేళ్లాడుతున్నాయి. గుమ్మానికి అడ్డంగా మంచంమీద చిందరవందరగా పరిచిన దుప్పటిమీద బోర్లాపడిచిన పుస్తకం, లోపల యింకా ఏవేవో సామాన్లు.... రెండుచేతుల్తో ముఖాన్ని కప్పుకున్న ఆమెను అర్థహీనమైన ఆమె శోకాన్ని సమన్వయించుకోలేకశ్రీహరి లేచినిశ్శబ్దంగా నడిచి పోబోయాడు "వెళ్ళకండి టీ త్రాగి వెళ్దురుగాని...." అని వెల్తుర్లోంచి గదిలోకి చటుక్కున దూసుకుని వెళ్ళింది, శ్రీహరి ఆగిపోయి నిలబడి రెండు చేతుల్ని ప్రక్క జేబుల్లోకి దోపి ఆలోచించుకుంటున్నాడు. స్టవ్ ముట్టించితెచ్చి వరండాలో వుంచుటూ తల పైకెత్తిచూసి 'అయ్యో.... నిల్చున్నారే కూర్చోండి.' శ్రీహరి ఆ దీపకాంతిలో ఆమె కళ్ళు వుబ్బి వుండటాన్ని గమనించాడు. ఆవిడ టీ కాచి యిస్తుందనికాని దాన్ని తను త్రాగ గలుగుతానని కాని అతనికి నమ్మకంలేదు. అతడు కూర్చోనూ లేదు. ఆమె సగంలో మళ్ళీ యేడుపు ప్రారంభించవచ్చు....ఆ టీ కాస్తూ కాస్తున్నదల్లా స్టవ్ ఆర్పేసి మోకాళ్ళమీద తల అన్చి కన్నీటి కాలువలను పారించనూవచ్చు....ఏదీ అసంభవ మనుకోటాన్కి వీల్లేదు. రెండే రెండు కప్పులనుతెచ్చి స్టవ్‌కు ఎదురుగ్గా బోర్లించి వుంచి ముక్కాలి పీటను సర్ది 'ఇప్పుడే రెండు నిముషాల్లో వస్తాను....టీ ఐపోతుంది కూర్చోండి. అల్లా నిల్చోవద్దు' అంటూ మొలనుండి రెండణాలుతీసి ఎటో

వెళ్ళిపోయింది. మేఘాలు క్రమ్ముకొంటున్నాయి. ఆ సుడిగాలిని చుట్టి గాలి వెఱ్ఱిగా వీవసాగింది. ఎండుటాకులు పండుటాకులు లేచి గాలిలో గిరగిరా సుడ్లు చుట్టసాగాయి. వర్షం కురవొచ్చు. శ్రీహరి జాగ్రత్తగా ఆలోచించుకోవటాని కుపక్రమించాడు. ఒక్క అనిముషం పరిశీలనగా గదిలోపలికి మెడను రిక్కించి చూశాడు. ఈవలకువచ్చి ఆలోచించు కుంటూ పచార్లు చేయసాగాడు.

"ఈవిడ ఏకాంత సుందరి. చుట్టుప్రక్కల ఎక్కడా మగవాసనలేదు." అందుచేత తప్పకుండా కొంత దుఃఖం ప్రదర్శిస్తుంది. ఆవిడకు కొంత సానుభూతి సహాయం తప్పకుండా అవసరం వుండి వుంటుంది....డబ్బు కూడా-తరువాత తన్ను గూర్చి చెప్పకోడానికి తగినంత కథకూడా యేదైనా వుండి వుండవచ్చు."

ఆమె వస్తూనే రెండు సిగరెట్లను ఒక తమలపాకుల కిళ్ళీనీ ముక్కాలి పీటమీద వుంచుతూ-'ముందు టీ పుచ్చుకుంటారు గాని-కిళ్ళీ వేసుగోకండి! అని కప్పులలోకి గబగబా "చా" పానీయాన్ని పోస్తూ 'మీ కెవరైనా పెద్దవాళ్లున్నారా అని అడిగాను-నా కెవ్వరూలేరు. నేనీ గదీ ఖాళీ చేస్తానన్నానని మీ కెవరు చెప్పారు? శ్రీహరి కొంచెం నిర్లిప్తతగా "మీ రెవరో నా కసలు ఏమీ తెలీదండి. గదులకోసం భవంతులచుట్టూ ప్రదక్షిణాలుచేస్తూచేస్తూ యిలా వచ్చాను అంతే-"

ఆవిడ పుచ్చుకోండి అంటూ చా కప్పు తెచ్చి చేతికి అందించింది.

"పంచదార సరిపోయిందా...."

"ఆహ్హా!" అన్నాడు శ్రీహరి.

వర్షం కురవటం ప్రారంభ మయినట్లుంది. స్టవ్ ఆర్పేసి గదిగుమ్మం పొదిగిటను నిలబడి "మూణ్నెల్లనుంచీ వంటిమీదివీ యింట్లో వున్నవీ క్రమంగా అమ్మేస్తూ వచ్చాను. ఇక యీ వాటా నిమిత్తం సలామీ కట్టిన 200 రూ॥లూ తిరిగి వసూలు చేసుకుని కలకత్తా వదిలిపెట్టి దేశం వెళ్ళిపోటానికే నిశ్చయించుకున్నాను."

శ్రీహరి ఆలోచించకుండానే 'ఇక్కడ మీరేం చేస్తున్నారు?' ఆవిడ విసుగుదలను సూచించే కంఠంతో "నన్నేం చెప్పమంటారు, నేను ఆడదాన్ని....మూడ్నెల్లు ఎల్లాగో కష్టపడ్డాను....యింకా ఎన్నాళ్ళు....దేశం వెళ్ళిపోతాను. మా వాళ్ళంతా వున్నారు, కాని వాళ్ళల్లోకి వెళ్ళటమంటే యేడుపొస్తోంది." శ్రీహరి హాస్యస్ఫోరకంగా-"మీ వాళ్ళందర్నీ మొత్తానికి యేడ్పించేశారన్న మాట,"

బయట వర్షం కురుస్తోంది. శ్రీహరి నాటకంలో పాత్రలా అభినయిస్తూ యిలా గన్నాడు. "చూడండి, నా కథ మీ కథ కేమీ తీసిపోదు. నన్ను చూడగానే మీకు దుఃఖం వచ్చింది. ఏదో మీ అవస్థ నాకు కొంత వినిపించారు. అర్థమయింది. మిమ్మల్ని యెవరు యిక్కడకు తీసుగొచ్చి వదిలేశారో వారు మిమ్మల్ని పూర్తిగా అధ్వాన్నపు టడవిలో వదిలెయ్యలేదు. మీరు సుఖంగా జీవించటానికి కొంత ప్రయత్నం చేశారు. వోడిపోయారు. ఇక నా సంగతి. నేను మగవాడ్ని-వుద్యోగం కోసం వచ్చి చెల్లని రూపాయిలా తిరిగి తిరిగి గత్యంతరంలేకజనపనార మిల్లులో చేరాను. చేరానైతే కాని తలదాచుకునే అనువుకోసం మహా గాలిస్తున్నాను. ఇల్లామనం తారసపడ్డాము. మీకు యింటిని వదుల్చుకునే సమస్య-నాకు యింటిని కుదుర్చుకునే సమస్య-కానైతే సలా మీకట్టడానికి దమ్మిడీకూడా నాదగ్గర లేదు."

ఆవిడ కొంచెం కోపంగా "డబ్బు కట్టలేకుండా ఎందుకు యిళ్ళ కోసం తిరగటం." శ్రీహరి నవ్వాడు.'సహజీవనం....' అంటూ, తరువాత వాళ్ళిద్దరూ కొంచెంసేపు మాట్లాడుకోలేదు. కిటికీల మీంచి నీళ్ళు టపటపా చిందుతున్నై! శ్రీహరి చొరవగా ప్రశ్నించాడు-

"ఈ మూడ్నెల్లూ మీరు వుద్యోగానిక్కూడా ప్రయత్నించినట్లు లేదు చూస్తే"

"ఏడుస్తూ పడుకునేదాన్ని-వున్న మేరకు వస్తువుల్ని మార్చుకుని తింటూ-"

"తినటమంటూ ఓటుందని గుర్తించా రన్నమాట"

"అవ్వేం మాటలు—"

శ్రీహరి సిగరెట్టు ముట్టించి బాగా పొగ పీలుస్తూ - గంభీరంగా, "నేను మిమ్మల్ని అర్థంచేసుకున్నాను. మీలాటి స్త్రీలు ఏడవటానికి తప్ప మరెందుకూ పనికిరారు. క్షమించాలి కొంచెం ఘాటుగా చెప్పాలి సుంది విషయాన్ని. మీకు జీవించటానికి తగిన వ్యక్తిత్వం లేదు. ప్రేమించట మంటూ యీ బురదలోకి మీరెందుకు దిగాలి? మీకు స్వంతనిలవల్లేవు, స్వయంపోషకత్వంలేదు, దేనిమీదైనా ఆధారపడకపోతే మీకు నిలిచే హక్కులేదు. పెళ్ళాడ్డానికి తప్ప ప్రేమకు పనికిరాని మీరు ఎందుకు సాహసించారు- యిట్లా కలకత్తా పారిపోయి రావటానికి, మిమ్మల్ని అధ్వాన్నపు టడివిలో వదిలి పారిపోయిన ఆ మహానుభావుడికి మీ మీద ప్రేమ తరిగి విసుగు పుట్టి వదిలేశాడని నేననుకోవటం లేదు, బహుశా మీ జీవితభారాన్ని యీవత్తూ అతడికి పోటీపెడ్తే అతగాడు తట్టుకోలేక పోయి వుండవచ్చు-ఎవరో తెలివితక్కువ వాళ్ళ-జీవితానికి స్త్రీ పురుషులు రథ చక్రాల్లాటివారని చెబ్తూవుంటారు. నిజానికి ఒకరెప్పుడూ కమ్చీ చేతబుచ్చుకుని వాయిస్తూ వెనుకనుంచి పొడుస్తూ వుంటారు, రెండవవారు హీనంగా భారంగా యీ బ్రతుకు బరువు లాగుతూ వుంటారు. యిదే సత్యమైతే మిమ్మల్నిగూర్చి జాలి పడ్డం అనవసరమంటాను. మగవాడు హడిలిపోయి జీవితంలో విసుగెత్తేవరకూ వాడ్ని హింసిస్తున్నామని గుర్తించలేని స్త్రీలు....వంటరిగా వదలివేయబడితే ఆ గతించినదంతా ప్రేమ క్రింద వూహించుకుని మగవాడ్ని కృతఘ్నుడిగా చిత్రించు కుంటారు."

"అయిందా వుపన్యాసం. ఆడదాని మీద మీ కసి యింకా తీరినట్లు లేదు. నేనెందు కేడ్చానో మీ కర్థమయిందని మీరనుకుంటున్నారు. నేను మిమ్మల్ని చూడగానే మీగొంతు వినగానే తీయని మాటల్తో వలపన్ని వుచ్చుల్లో ఆడదాన్ని యిరికించి స్వంతం చేసుకుని కొన్నాళ్ళకు మొహం మొత్తి పారిపోయే దుష్టస్వభావం గుర్తుకొచ్చి విలపించాను. నేనేదో మీ పీకకు చుట్టుకోబోతున్నాననీ నా కన్నీటితో మీ హృదయాన్ని కరిగించి

ఆసరాగా అండగా మిమ్మల్ని చేసుకుంటానేమో అని తగు జాగ్రత్తతో మూంచి ఘట్టి పుపన్యాసం వినిపించారు. బావుంది. మరి నాభయం నాకుంది. మీ దగ్గర చిల్లికానీ లేదంటున్నారు. సహజీవనం అన్నారు. ఎక్కడో ఫ్యాక్టరీలో పని-మీకు చులాగ్గా ఆట్టే శ్రమలేకుండా నివాసం కుదరాలి-అన్నీ అమర్చి పెట్టే మనిషి దొరికినా సరే - అవసరం! యింతవరకూ ప్లాను బాగానే వున్నట్లుంది. మనం ఎంత క్రొత్త వాళ్ళమైనా యింత సూటిగా మాట్లాడు కోవటం బాగులేదూ?''

శ్రీహరి గట్టిగా ఛీత్కారం చేశాడు - "ఛీ! ఛీ! ఎంత అవమాన కరంగా ఆలోచిస్తున్నారు? నా దగ్గర డబ్బులేదనీ నేను గత్యంతరం లేక ఫ్యాక్టరీలో పని చేసుకుంటున్నాననీ నిజం వెళ్ళబెట్టినందుకు నన్నెంత లోకువ కట్టేశారు! ప్రేమ, జీవితాన్ని ధ్వంసం చేస్తుంది. జీవితాన్ని ఎదుర్కోలేని వాళ్ళకు ప్రేమించే హక్కులేదు. ఎవరి జీవితం వారిదే.... మీస్వార్థం మీకుంది నా స్వార్థం నాకుంది. నాగురించి మీరేం భయ పడ్నక్కర్లేదు. రేపు మీ సలామీ రెండువందలు మీకు చిక్కగానే చాలా చిత్రంగా మారిపోతారు. ఇంటికి వెళ్ళి మీ వాళ్ళలో కలిసిపోతారు. జీవితాన్ని మర్చిపోయి మళ్లీ టింగురంగా అవి క్రొత్తవలలేసి లోకం మీదకు విసురుతారు. మీ చిరునవ్వు మీ చూపులు మీ మాటలు...."

ఆమె బిగ్గరగా అరిచింది "చాల్చాలు. ఇకమీరు దయచెయ్యండి. నేనేమీ అట్లాటిదాన్ని కాను. అస్సలు నేనీ గది ఖాళీ చెయ్యనే చెయ్యను. నాకు సలామీ అక్కర్లేదు, నా దోవ నేను వెతుక్కోగల్ను. మీ నీతులు చాటభారతంలా వినీవినీ తలబట్ట కట్టేస్తోంది'"

శ్రీహరి ముక్కాలి పీటమీద కూర్చుని స్టవ్ కొంచెం ముందుకు లాగాడు. అగ్గిపెట్టెతో సిగరెట్ ముట్టించుకుని 'ఆ పాల డబ్బా యిటు పారెయ్యండి-యీ గిన్నె కడుక్కొచ్చి యివ్వండి. మరో కప్పు టీ మీనుంచి బలవంతంగా పొందగల్ను." అని జేబులోనుంచి రూపాయి కాగితాన్ని తీసి "మనం జీవిత సత్యంవైపు పరిగెడ్తున్నాం. వొకపెట్టె సిగరెట్లూ పెద్ద బన్‌రొట్టి రెండు కిళ్లీలు కావాలి. చప్పున పట్రండి. మీ

రివ్వాళ నన్ను చాలా అనరాని మాట లన్నారు. వెళ్లిపొమ్మని ఎప్పుడైతే గంభీరంగా మందలించారో నా కప్పుడే బోధపడిపోయింది. మనం ఎవరైన్నైతే ఎక్కువగా అభిమానిస్తామో వాళ్ళే తీవ్రంగా మందలిస్తాము కూడా."

ఆమె రూపాయి తీసుకుని విసరి పారేస్తూ అంది, "మీ రెంత అవక తవగ్గా మాట్లాడినా వింటున్నది-అనంతా నేను మంచిదాన్ని కావటంవల్ల ననుకుంటున్నారేమో....నా కన్నులు తెనుగు మాటలు వినిపించి చాలారోజు లయింది. మీరేం మాట్లాడారో నా కక్కర్లేదు. మీరు మాట్లాడ్డమే నాకు బావుంది." శ్రీహరి "నేను మాట్లాడితేనే మీకు బాగుందంటున్నారు. ఈ ముక్క మీరు వుపసంహరించుకోవాలని నేను తీవ్రంగా మందలిస్తున్నా."

ఈ మాటల్ని ఆమె వినిపించుకోలేదు. శ్రీహరి ఆలోచిస్తూ కూర్చున్నాడు. బైటవాన నాసిగా కొడ్తోంది. బస్సు పరుగులెట్టే చప్పుడు క్రమంగా తగ్గుతోంది. ఒంటిపొర గుడ్డలో మెరిసిపోయే అందమైన ఆడదానిలా కలకత్తా కులికిపోతోంది. పదినిముషాలువాకా ఆమె రాలేదు. స్టవ్ మీద టీ తయారుగా వుంది. ఆవిడ వచ్చింది - చెంగువిప్పి అన్ని వస్తువుల్నీ నేలమీద పర్చి-'మిఠాయికూడా తెచ్చాను పావు శేరు.' శ్రీహరి పరిహాసంగా "మళ్ళీ అదికూడా యెందుకు? ఇంతసేపు చేశారేం?"

ఆమె కోపంగా అంది- "మీ రిల్లాటి ప్రశ్న లడగటం యేమీ బాగాలేదు. నా మీద అధికారాన్ని పుచ్చుకుందుకు వ్యర్థంగా శ్రమపడ కండి, ఇవిగో డబ్బులు". శ్రీహరి నిదానించి చూసి "ఈ బేడకాసు చెల్లదండీ. మీకు మళ్ళీ ఎవరో టోకరా వేశారు." అన్నాడు నవ్వు ఆపుకుంటూ. ఆవిడ చరచరా గదిలోనికి పోయి తలుపు భడాల్న మూసేసుకుని మంచంమీద వాలిపోయింది.

శ్రీహరి చక్కగా ఓపిగ్గా ఆ బన్‌రొట్టెను కోసి కాల్చాడు. టీ కప్పుల్లోకి వొంచి తలుపు నుద్దేశించి "మీరల్లా తలుపుల్ని ఛడాల్నవేసు కోవటం చాలా అనుచితం. మీకు కోపం వచ్చేముందర మీ పేరు నాకు

చెప్పవుంటే మిమ్మల్ని బ్రతిమాలడానికి కొంత వీలుగా వుండేది. అల గటం అనేది క్రొత్తవారిమీద ప్రయోగించ వలసిన అస్త్రం కాదను కుంటాను,"

ప్రత్యుత్తరం రాకపోగా శ్రీహరి మిఠాయి ముందు తినేసి కాల్చిన రొట్టె ముక్కలను నములుతూ "మనలో ప్రేమ అంటురోగంలా వ్యాపి స్తోంది. ఇట్లాటి మానసిక వ్యాధి తగుల్చుకుని దేశంలోని యువతీ యువకులు వెన్నెముకల్లాటివాళ్లు జీవించే అర్హతను కోల్పోతున్నారు. జీవితాన్ని ఎదుర్కొనలేక పోతున్నారు. మన వుభయుల సమస్యలూ పరిష్కారమయే సుళువు నేను చెబుతున్నాను. నా జీవితంలో యింటి పని భాగం పంచుకోలేదు ఎవ్వరూ-నే నెవరి జీవితంలోనూ పంచుకోవటానికి ప్రయత్నం చెయ్యలేదు గనుక. మీరిప్పుడే పప్పులో కాలువేసి కడు క్కుంటున్నారు గనుక, తమరేచేనా వుద్యోగం చెయ్యండి యిద్దరంకలిసి ప్రయత్నిద్దాం. మీరు నెగ్గితే-నేను మీరేం చెబ్తే ఆ పని చేస్తూ గౌరవంగా మిమ్మల్ని కనిపెట్టుకు ఉంటాను. ఈ వొడంబడికమీద సంతకంచేస్తారా"

ఆమె లేచి రెండుతలుపుల మధ్యనుంచి తలకాయ కనపడేలా ముఖంవుంచి "మీరు చాలా హుషారుగా మాట్లాడుతున్నారు. కడుపు కాస్త చల్లబడినట్లుంది. ఈ వాన యెంతకీ తగ్గేట్టులేదు. ఈవాళ అకస్మా త్తుగా మీ పరిచయమైంది. ఎన్నాళ్ళనించో ఎరిగున్నట్లు మన జీవితాలు వొకరి కొకరు బాగా తెలుసుకున్నట్లు గుండెల్ని విప్పుకుని మాట్లాడాం- సూటిగా, తిన్నగా.

"గుండెల్ని విప్పొద్దు. అక్కడ మరేదన్నా ముక్కవాసండి బావుంటుంది."

ఆమె కులాసాగా నవ్వేసింది. శ్రీహరి నుద్దేశించి "ఇన్నాళ్ళకి మళ్ళీ ఎవరో నన్ను నవ్వించగలిగాడు. అస్తమానూ యేడుస్తూ మంచం మీద పడుకుని అఘోరించేదాన్ని. చీకట్లోకి నేరుగాపడిన ఒకేఒక సూర్యకిరణంలా వచ్చిన మీరు....,"

"చాల్చాలు - ఆపండి. నా కాళ్ళక్రింద భవంతి పూగిన లాడి పోతోంది. ఆటంబాంబు పడినా నేనంతగా విచారించను, మీ కవిత్వం నామీదపడి నా ఆశయాల కోట భిన్నాభిన్నమైంది. మరిక నేను కదుల్తా...." అంటూ శ్రీహరి లేచాడు. "వుండండి, నేనూ వస్తా-" నన్న ఆమె మాటల్ని వినిపించుకోకుండా అతడు ఆలోచనగా బైటకు చూస్తూ మెట్లవైపు కదిలాడు. అతనా మెట్లన్నీ గడిచి మనుషుల్ని తప్పుగుంటూ దిగువకు చేరుకునేసరికి సరిగా పావుగంట దాటింది. దర్వాను చేతిలో వో బేడ పారేసి నూట ఎనభయ్యో గదిలోని ఆవిడపేరు చీటీమీద రాసుకుంటూండగా ఆమెవచ్చి "పద ండి. ఇంత ఆలస్యం చేశారేం? ఎంత సేపని వీధిలో మీకోసం కనిబెట్టు కూర్చోడం...."

శ్రీహరి "మీరా—శారదా...." సాశ్చర్యంతో చూశాడు. నోట మాట పెగిలి రాలేదు. శారద నవ్వుతో "వుండమంటున్నాను వచ్చేశారు, నేను మిఠాయి తీసుకున్నాను. మీ రుంచిన టీ త్రాగాను. బట్టల్ని మార్చుకుని లిఫ్టుమీద దిగిపోయాను."

శారద నాజూగ్గా ముస్తాబయింది. చేతులకు ముఖానికి పవుడరు రాసుకుంది, పెదిమలకు కాస్త ఎర్రరంగు వ్రాసింది. పువ్వుం పువ్వుల వాయిలచీర గట్టుకుంది. జడను చుట్టచుట్టుకుని చక్కగా నెట్‌లో బిగించింది. బస్సుకోసం నడుస్తూండగా శ్రీహరికి తన వామహస్తాన్ని కుడిచేతి కందిచ్చి అడుగులోఅడుగుపేస్తూ "నా సేరు మీరు ఎట్లా అనుకున్నారు?" అంది, శ్రీహరి వారిస్తూ "దానికేంలెండి గాని - యింత పరుసూ ధన్యుడ్ని. మరేం ప్రమాదం తీసుకు రాటుగదా? ఇప్పుడు మనం ఎక్కడకు వెళ్తున్నదో కాస్త తెలిపి పుణ్యం గట్టుకోండి, ఎందుచేతనంటే మీ చేతిని ఎప్పుడైతే నా కందిచ్చారో అప్పుడ్నుంచీ నాకు సగం వ్యక్తిత్వం పోయినట్లే-అంటే మనం మ్యారేజ్ లాటిది చేసుకున్నట్లు పరోక్షంగా నా దగ్గర బేడ దీసుకుని మీ పేరు నాకు చెప్పిన దర్వానుసాక్షి, ఇదిగో నేను వ్రాసిన కాగితం-యిందులో మీ పేరు" అని శారద అని వ్రాసిన

కాగితాన్ని ఆమె గుప్పెట్లో వుంచుతూ "ఇప్పుడు చెప్పండి-మనం ఎటువైపుకి వెడుతున్నాం?"

శారద నవ్వుతో "సినిమాకి ఎటన్నా పోదామా ?"

"ఈ రోజున అపరిచితులైన మనయిద్దరి మధ్యా యిట్లాటి - కనీ వినీ ఎరుగనటువంటి అద్భుతం జరిగాక - సినిమాలో కూర్చుంచే మట్టుకు యేం క్రొత్తఅనుభవం కలుగుతుంది ?"

"ఏమో నా కింకా మామూలుగానేవుంది. మీకేమన్నా మేఘాల మీద తేలిపోతున్నట్లు వుందిగావును."

"అవును మరి నాకిచే క్రొత్తగా...." శ్రీహరి నవ్వాడు. శారద కోపంగా చేయిలాక్కుంది, వెనక్కి అడుగుల్ని వేయసాగింది. శ్రీహరి ఆమె భుజంమీద చేయినివేస్తూ లాలనగా "మీరు నాకు గురువులు యీ రంగంలో....నేను చాలా చిన్నవాడ్నన్న విషయం పదేపదే తమకు మనవి చేయనక్కర్లేదనుకుంటాను. నరేనా...." ఆమె తలవూయించింది, ఇద్దరూ జనంలోకలిసిపోయాకబస్సునీడవచ్చి హౌరాపంతెనదగ్గరదిగిపోయారు. బజారుల్లో తిరుగుతూ చెట్టు సంపెంగపూలను వొడినిండా కొనుక్కొని ఆ బజారువాళ్ల దగ్గిరే పొట్లాల దారాన్ని పుచ్చుకుని "పదండి - యీ వంతెన క్రిందకు పోదాం....వాన కురిసినా మళ్ళీ భయపడ్నక్కర్లేదు, ఇన్ని దీపాలు యింత వెల్తుర్లోంచి తప్పుకుని చీకట్లో నది అంచున నడవటం బాగుండదూ...." ఇద్దరూ మనుషుల్ని తప్పుకుని రాళ్ళను దాటి "హౌరా" వంతెన క్రిందకువచ్చారు. ఆ వంతెన తాలూకు దీపాలకాంతి హుగ్లీ నదిమీద నిండుగా ప్రవహిస్తోంది. ఈవలా ఆవలా చాలా పెద్దస్టీమర్లు లంగర్లేసుకుని విశ్రాంతి తీసుకుంటున్నాయి. చిన్నచిన్న నావలు పదపదలు అనేకం వొకదాన్నొకటి రాసుకుంటూ నీళ్ళలో గట్టున తేలియాడు తున్నాయి. జనాన్నుంచితప్పుకుని ఖాళీగా వున్న నావలోకి శ్రీహరిమోకాడు అతని చేతిని ఆసరాగా తీసుకుని శారద జాగ్రత్తగా లోపలకునచ్చి కూర్చుంది. నావ తాలూకు తెడ్లని గట్లమీద పేర్చి భద్రపర్చారు. పెద్ద పెద్ద లాంచీలు వుండీవుండి విస్సురుగా గోల చేసుకుంటూ నదిలో

పరుగులెత్తుతున్నాయి. ఓడలమీద నావికులు విశ్రాంతిగా అటూయిటూ పచార్లు చేస్తూండటం కనిపిస్తోంది.

శ్రీహరి వొక్కడూ పడవమీద నిల్చొని రమ్యంగా ఆలోచించు కుంటూ ఆకాశంలోనికి చూస్తున్నాడు. మేఘాలు నిషాదచ్ఛాయల్ని దించుకుంటూ దిగువ తారట్లాడుతున్నాయి. వర్షించి వర్షించి విశ్రాంతి తీసుకున్న వాతావరణంలో-నావ అడ్డుచెక్క-మీద వయ్యారంగా కూర్చున్న శారద సంపంగి పూలను దీక్షగా మాలక్రింద అల్లుతున్నది.

శ్రీహరి ఆమెవంక పరిశీలనగా చూస్తున్నాడు. జుట్టు చక్కగా గాలికి ఎగుర్తోంది. పల్చటి చీరమడతల్లో ఆకారాల్ని తీర్చుకుంటూ నున్నగా వంకరలు తిరిగి ఎత్తుగా కిక్కిరిసి మళ్ళీ అంచంగా జారి పోతూ వాళ్ళో కుప్పగా కూలిపోయిన సంపంగి పూలల్లోంచి ఘుమా ళిస్తున్న సువాసనలు మత్తులా గాలిలో పరివ్యాప్తమై శ్రీహరిని బంధిస్తు న్నాయి. శారద వంగివంగి చెండును పూలను నీళ్ళల్లో తడుపుతోంది. హుగ్లీ గంభీరంగా వంతెన నీడల్లో నల్లగా కదిలిపోతూ కదలిపోతూ వుంది. చాలా దూరాన్నుంచి గంగానదిలో చేపల్నుపట్టే జాలరులు అలవాటుగా విసిరే బెంగాలీ పల్లెపదాలు వినపడ్తున్నాయి. మహానగరం బద్ధకంగా ఆవులించి వొళ్ళు విరుచుకొంటున్నది.

శారద కూర్చున్న చెక్క-మీద చేతులాన్చి ఆమె వయ్యారంగా మణిచిన చీర కుచ్చిళ్ల తన గుండెలకు దగ్గిరగా లాక్కుంటూ నావలో దిగువను కూర్చుండిపోయి ఆమె వొళ్ళో తల పెట్టుకుని రెండుచేతుల్తో ఆమెను పెనవేసుకుంటూ "గురూ! ఏమిశలవు?" అన్నాడు శ్రీహరి. శారద కిలకిలా నవ్వింది. ఆమె వొళ్ళోని సంపంగి పూలన్నీ క్రమంగా ఎగుర్తూ వారిరువుర్నీ కప్పుతూండగా సగం పూర్తయిన చెండుని శారద శ్రీహరి తలకు గుండ్రంగా చుట్టుతూ "మాట్లాడరేమండీ-" అంటూ మీదకు వ్రాలిపోయింది. జీవితాన్ని తెలుసుకున్న ఆమె నిండైన వక్షస్సు అతడి పార్శ్వమంతా పులకింప చేసింది. అతని ముఖాన్ని తన ఒళ్ళో

దాచుకుని అనందంతో పరవశమైపోతూ పూర్తిగా ప్రారిపోయింది శారద.

శారద కిల్లాటివేమీ క్రొత్తకావని ఆక్షణంలో శ్రీహరికి స్ఫురించ లేదు. సంపంగిపూలన్నీ బాగా నలిగిపోయాయి. నావ తమాషాగా నీటి మీద తేలియాడింది. బ్రిడ్జీమీంచి దీపాల వెల్తురు దిగువను ప్రవహిస్తున్న హుగ్లీ నదిని పడవలను లాంచీలను స్పష్టంగా చూపెడ్తోంది. మిగిలి పోయిన రాత్రి మహా మధురంగా కరిగిపోతున్నట్లు తోచింది. దూది పింజెల్లాటి తెల్లటి మేఘాలు బాగా పైపైన కదుల్తూ పోతున్నాయి. వంతెనమీద పాదచారుల సవ్వడిమాత్రం నిరంతరం వినిపిస్తూనేవుంది.

శ్రీహరి శారదా యింటిముఖం పట్టారు. బస్సులు పరిగెట్టటంలేదు గనుక ఎంతకీ తరుగని దూరాన్ని కబుర్లతో నవ్వుల్తో పరాచికాల్తో దాటొచ్చునని నిశ్చయించుకున్నారు. శ్రీహరి నవ్వుతూ అన్నాడు.

"మహా ప్రమాదంలోకి వురికినట్లున్నామే-"

శారద కొంచెం తటపటాయిస్తూ "అంటే...." అని తల ఎగర వేసింది.

"నాకంతా క్రొత్తగా భయంగావుంది." "పాపం !"

మౌనంగా యిద్దరూ కాస్సేపు నడిచాక శ్రీహరి కాస్త ఆలోచ నగా- "మన యీ స్నేహం దృఢంగా శాశ్వతంగా వుండాలంటే ఏం చెయ్యాలి ?" శారద కొంటెగా "స్నేహం !....అంత పెద్దమాటలెందుకూ అవసరం అనరాదూ....యింకా సత్యానికి దగ్గరకు వస్తాంగా,"

శ్రీహరి తన రెండుచేతుల్తో ఆవిడ బుజాన్ని పుణుకుతూ "చాలా బాగా నిక్కచ్చంగా అనేశారు. అవసరమే.... నిజంగా మనకు దైహిక మైన కొన్ని అవసరాలు తీరవల్సివున్నాయి. వీట్లకోసం పడే భావతా పత్రయంలోంచి కొన్ని అనవసరపు సుకుమార శబ్దాల్ని కనిపెట్టి వాడి సత్యాన్నుంచి దూరంగా పరిగెట్టడం మామూలుగా జరుగుతోంది.

శారద వూ కొడ్తూ నడుస్తోంది చలాకీగా-

శారీర కావసరాలకోసం ఏర్పడ్డ సంస్థచుట్టూ తెరల్ని కట్టుకుని అనవసరపు పదజాలాన్ని వాడుకొంటో జీవితాన్ని వ్యర్థం చెయ్యడం కన్నా-దాన్ని భౌతికావసరంగా గుర్తించి అంతకుమించిన విలువ యివ్వకుండా జీవించకలిగితే కొన్ని అనవసరపు సమస్యలు వెలికిరావు."

"గొప్ప అర్థంలేని భాషను మాటల్లో వుపయోగిస్తూ అందమైన రాత్రిని హత్య చేస్తున్నారు." అంది శారద.

శ్రీహరి "వొక విషయాన్ని గురించి మనోహరంగా రమ్యంగా చెప్పాలంటే, వేరుమార్గాన్ని వాస్తవాన్ని తరిచి నిజం చూపించాలంటే మరో మార్గాన్ని అవలంబించక తప్పదు. కొంచెం కటువుగా వుండొచ్చు మాటలు-" అన్నాడు.

"ఏమండీ ఎందుకంత బాగా ఆలోచిస్తున్నారు మనసమస్యను...." "జీవితాల్తో చెలగాటాలు, పరిహాసాలాడ్డం అంత మంచిపని కాదు శారదా! నేను భయపడ్తున్నాను - నా వల్ల కూడా తిరిగి మీకేమన్నా...." "....టోకరా తింటాననా. ఐతే యిందాక ఆ బేడ ఏంచేశారు?" "బస్సు వాడి కిచ్చేశానుగా-" యిద్దరూ హాయిగా నవ్వుకొన్నారు. శ్రీహరి కొంచెంతీవ్రంగా "శారదా మీకో చిన్నమనవి. కొంచెం ఆగండి.". ఆమె చేతుల్ని కట్టుకుని ఖులాసాగా నవ్వుతూ నిలబడిపోయింది, శ్రీహరి ఆరంభించాడు-"మనం నిర్మొహమాటంగా కటువైన భాషలోనే పరస్పరం మాట్లాడుకుందాం. నేను వొకగంటక్రితం వరకూ నిష్కల్మషమైన బ్రహ్మచారినే...."

"ఛ....ఛ....ఛ....యిదేవిటి!" అంటు శారద ఫకాలుమని విరగబడి నవ్వసాగింది, శ్రీహరి కొంచెం కసురుతూ "వినండి, అల్లా అని నాకేం గర్వంలేదు. మీరు మిక్కిలి మీ గతజీవితానుభవాన్ని నేను

మన్నిస్తాను. మీ గురుస్థానం అల్లా వుంటుందనుకోండి. యిహ మన వుభయ జీవితాల సమస్యల దగ్గిరికి వొద్దాం."

శారద అయోమయంగా "నా కేమో బాగా నిద్రవస్తూన్నట్లుంది," అంటూ ఆవులించింది. "సరే పదుద్దాం-" అనిమధ్యలో ఆపుజేసి శ్రీహరి ఆమె చేతుల్ని తన చేతుల్లోకి తీసుకుని అడుగులో అడుగుల్ని వేసుకుంటూ అన్యోన్యంగా పురోగమించ సాగారు. రాత్రి వాలిపోయింది.

* * *

ఇది జరిగి యిప్పటికో శతాబ్దమైంది, ఇంకా పైనేకావచ్చు. శ్రీహరి- శారదా చిలుకా గోరువంకల్లా వుండివుంటారని-వారి ఆతిమ్మా జీవితం యావత్తూ మూడు పువ్వులు ఆరు కాయలనుకుంటే అనంతా తప్పు. శ్రీహరి చెక్కు చెదరకుండా వున్నాడు-ఐతే శారదమాత్రం ఏమై పోయిందో. ఎట్లా అంతమైపోయిందో అదంతా చెప్పవలసివస్తే శ్రీహరి మాటల్లోనే చెప్పాలి. శ్రీహరి యీ మాటల్ని చెప్పలేదు. ఒకవేళ చెప్పవలసివస్తే.... "నేను శారదని అతి కష్టంమీద మర్చిపోగలిగాను. ఆమె పల్చటి కాంతివంతమైన ముఖం చురుకైన చూపులు నా అసహాయత్వాన్ని గుచ్చి గుచ్చి ప్రశ్నిస్తాయి, కొన్నాళ్ళు ఆమెను స్వప్న డోలికల్లో వూగించి అకస్మాత్తుగా కాక క్రమంగా అధ్వాన్నపు చీకట్లోకి యిద్దరం విసిరివేయబడ్డాం. మనుష్యులం అవసరాల నిమిత్తం వొకరి కొకరం అయ్యాం, మేం వొకర్నొకరం అనుమానించుకుని కానీ ద్రోహం చేసుకునికానీ ఎరగం. జరిగిందల్లా యీ దాంపత్యం మా కవసరమైనప్పటికీ యీరకం జీవితానికి మేం అర్హుల మనిపించుకోలేకపోయాం. కలకత్తాలో మాజీవితం మహాభయంకరమైపోయేసరికి స్థితిగతుల్లో నిరంతరసంఘర్షణ యేర్పడి ఒకరి కొకరం మహాభారం కాసాగాం. ఈ సందర్భంలో శారదలాటి స్త్రీలతో నాకు ఎల్లప్పుడూ జాలి గౌరవమూ సానుభూతి వుంటుంది. నేను ఆమెలోని లోపాన్ని యిన్నాళ్ళకు యిక్కడ మీయెదుట విపులంగా చర్చించి అవిడ్ని పరోక్షంగా న్యూనపర్చా లనుకోవటంలేదు.

హిందూ స్త్రీ మహాసాధ్వి....వొప్పుకుంటున్నాము, ఇది తల్చుకుని యీ లక్షణానికి స్త్రీజాతి నంతా హిందూస్త్రీ అధిగమిస్తుందని చంకలు వాయించుకోమంటే చాలా విచారిస్తాను. శారదకు కబుర్లు బాగా చెప్పటం నవ్వించటమైతే వచ్చుగాని దురదృష్టవశాత్తు యే భాగ్యవంతుడో గాకుండా వొక జనపనార ఫ్యాక్టరీ కూలీకి ఆమె సహధర్మచారిణి కావటం మూలాన చాలా తక్కువ కాలంలోనే మా దాంపత్యంలోని మనోహరత అందం ఆనందం పూర్తిగా అడుగంటాయి. సమ్మెలువచ్చి ఫ్యాక్టరీమూసేశారు, ఉద్యోగంవున్నా లేనట్లే, కట్టుకుందుకు బట్టలుకూడా కరువయ్యాయి. మా చుట్టూ వున్న సామాజిక వ్యవస్థ కుంచించుకుని కుంచించుకుని మాకు దాంపత్యజీవనం అనవసరమన్నంత క్రూరంగా భయంకరంగా సత్యాన్ని చేరుకునేసరికి నాకు మతిపోయి నట్లయిపోయింది. నలభై రూపాయల అద్దె చెల్లించటంకూడా భారమయ్యేసరికి మహా మహా సౌధాల సందుల చేరువకు, మురికి కాలువల గొందుల్లో, చెత్తడబ్బాల ప్రక్కన జీవించటానికి సిద్ధమయ్యాం. మాకు జీవితంలో విచారంలేదు-కాని తీరని కసి మాత్రం యేర్పడిపోయింది నా భార్య అని ఆమెను నేనెన్నడూ అవమాన పర్చక పోయినా "అయ్యో హిందూ స్త్రీ! నీకు ఒక్కకానీ స్వయంగా సంపాదించుకుని స్వయంపోషకంగా జీవించటం తెలిస్తే మన జీవితాలు మనదేశం ఎంత అద్భుతంగా పురోగమిస్తుంది-నీవు నీ యావత్తు భారాన్నీ పిల్లల్ని సంసారాన్ని వొక అభాగ్యుడిమీద వేసి యిద్దరూ జీవితాన్ని దుఃఖభాజనం చేసుకుంటున్నారు గనుక-నీవు ఏ మాత్రం నీ కాళ్ళమీద నిలబడి సంపాదించగలిగినా సంఘంలో నీ వునికి మహత్తు మారిపోయి జీవితాన్ని చక్కగా ధైర్యంగా ఎదుర్కొని జయించ గల్గుతావు." అని తలపోసి ఆమెకు నూరిపోస్తూండే వాడ్ని. నేనొక్కడ్నే సంపాదించటం-శారద పూర్తిగా నామీద ఆధారపడి వుండటం నన్ను హెచ్చుగా నిస్సహాయుడ్ని చేసి పారేసినై. ఆస్తిని పిలవడానికి వీలైన వస్తువునల్లా మార్చుకుని తినేశాం. పస్తులు ఆరంభమయాయి. శరీరాలు కుష్కించాయి. మాకు పరస్పరం బాధగా దృక్కుల్ని మార్చి

పోవటం వినా మరెందుకు వోపికలేదు. అన్నట్లు చెప్పటం మరిచాను. మా అనవసరపు దాంపత్యానికి ప్రతిఫలంగా వో ఆడపిల్ల. చెత్తడబ్బాల పక్కన మురికి కాలువల వొడ్డున సందులో జీవించలేక విసుగెత్తి వొకరికొకరం యేమీ ప్రయోజనంలేదని తెలుసుగున్నాక మాటామంతీ లేకుండానే విడిపోయాం. ఒకచెంపన యుద్ధం ముమ్మరంగా సాగుతోంది. ఆహారద్రవ్యాల కరువు - బెంగాలు మహాక్షామం దేశాన్ని పూర్తిగా తుడిచిపెట్టేస్తోంది. ఇండియాకి స్వరాజ్యం రాలేదు. బర్మాలో యుద్ధం. ఇండియా గుమ్మం పొదిగిటను యుద్ధం పొంచి చూస్తోంది. ఇండియాలో వ్యాపారస్థులు బాగుపడ్డారు. నాబోటి ప్రేమ వ్యాపారస్థులు దివాళా తీశారు. సామాన్య కుటుంబీకులు నుగ్గు నుగ్గయి బొగ్గుబొగ్గయి అంతా మాసి పోయారు. బీదవాళ్ళు మరీ బీదవాళ్ళై పోయారు. కలకత్తావీధుల్లో ఆకలి శవాలు వందలూ వేలూ....గంజికేంద్రాలన్నీ ఆశతో చుట్టేశాను-శారదా నా బిడ్డా ఎక్కడైనా దొరుకుతారేమోనని. ఈ అనవసరపు వ్యాఖ్యతో మీకు విసుగెత్తిస్తున్నానల్లేవుంది. కాని వొక చిత్రం చూశాను, కలకత్తాలో ఒక కూడలిలో పేవుమెంటు వద్ద జనం గుంపుగా ప్రోగుపడ్డారు. అందులో ముఖ్యంగా మిలటరీవాళ్ళు చాలామంది వున్నారు. ఇంకా లోపలికి దూరి నా కళ్లారా ఆశ్చర్యంతో చూశాను. ఒక పడుచుదనంలోనిస్త్రీ పసిబిడ్డను ఒళ్ళోపెట్టుకుని ఎదటగా చెరగుపర్చి ముఖమెత్తి జనంలోనికి చూస్తూ తన పమిట చెరగును వొక్కమాటు నిమిషంనర వొత్తిగించి చూపించి మళ్ళీ మూసేస్తోంది. రూపాయలు అర్ధా పావలా ఘల్లు ఘల్లున రాల్తున్నాయి. ఇది చూశాక నా తల దిమ్మున తిరిగి పోయింది. శారద గూర్చి ఆలోచించవలసివస్తే భయంకరమైన భావాలు నిర్దాక్షిణ్యంగా నన్ను చీల్చి చెండాడేవి.

ఇదంతా జరిగాకకూడా నేను మిగిలే వున్నాను. ఇండియాకి స్వరాజ్యం వచ్చింది. పాకీస్తానం వచ్చింది. అహారంలో స్వయం సమృద్ధి సంపాయించుకుంది. యిన్ని సంతోషకరమైన విషయాలనేకం జరిగి నప్పటికీ "శారదను సంపాయించుకోలేక పోయాను. ఆ అనవసరపు

దాంపత్య ఫలాన్ని ఆడపిల్లను బుజాన్నేసుకుని ఎన్నాళ్ళు యే అగచాట్లు పడ్డదో యెక్కడ విధిని యేమని దూషించిందో నాకు తెలియదుగాని యిప్పటికీ ఎప్పటికీ ఆమెజాడ తెలీదు. సుభాసుబోసు రేడియోలో మాట్లాడుతాడు. మళ్ళీ వస్తాడని ఎప్పుడన్నా పత్రికలో బడ్డం తటస్థపడితే నా శారదా చిట్టిపాపా తలపుకొచ్చి ఏ కావమ్మకథలోకిమల్లేనో హఠాత్తుగా 'నాన్నా!' అంటూ వచ్చి నా బిడ్డ నా మెడను చుట్టుకోదా, నా శారద 'అవ్వేం మాటలు' అని నవ్వుతూ 'ఏమండీ' అని నా ఎదుటనిల్చి పల్కరింపరాదా అని గోముగా వూహించుకుని వులికులికి పడ్తూంటాను. మొత్తానికి దేశంమారింది. కాని....కాని...."

